ఆంధ్రపత్రిక



The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 28 FRIDAY 29th APRIL 1949 వెల ఒకఅణా { Founder: K. Nageswara Rao

# భారత రిపబ్లిక్‌కు కామన్వెల్తులో సమగ్ర సభ్యత్వం

## భవిష్యత్ అధ్యక్షుని సర్వాధిపత్యం: రాజుకు కేవలం లాంఛన ప్రతిపత్తి

### ప్రధానుల నిర్ణయాలపై అధికార ప్రకటన

**లండన్, ఏప్రిల్ 27:** భారతదేశం కొన్ని నెలలలోనే సర్వస్వతంత్రరిపబ్లిక్‌గా మారిన తర్వాత కూడా, విగతా అధినివేశాలతోపాటు సరిసమాన హోదాతో కామన్వెల్తులో సమగ్రమైన సభ్యత్వం కలిగి ఉంటుందని కామన్వెల్తు ప్రధానులు ఇప్పటికి ఆరురోజుల నుంచీ ఇక్కడ జరుపుతున్న రహస్య సమావేశాల పర్యవసానంగా నేడు అధికార ప్రకటన వెలువడినది.

సర్వస్వతంత్ర రాజ్యాల యధేచ్ఛా సహకార సంబంధాలతో కూడుకొన్న కామన్వెల్తుకు బ్రిటిష్ రాజును కేవలం చిహ్నప్రాయుడైన అధిపతిగా గుర్తించడానికి భారతదేశం అంగీకరించినది.

అయితే, భారత దేశానికి సంబంధించినంతవరకు రాజుకు ఏవిధమైన రాజ్యాంగ బాధ్యతలు వుండవు. భారత రిపబ్లిక్ భవిష్యత్ ఆధిపత్యమంతా భారతీయులు ఎన్నుకునే అధ్యక్షుడిదే. రాజు నిర్వహించే అధికార బాధ్యతలన్నిటినీ భవిష్యదధ్యక్షుడే చెలాయించగలడు.

ఆరవనాటి సమావేశంలో భారత ప్రధానామాత్యుడు నెహ్రూ ఉపన్యసించుచూ కామన్వెల్తును సైనిక రాజ్యకూటమిగా భావించుటకు వీల్లేదని ఉద్బోధించినట్లు తెలియుచున్నది.

కామన్వెల్తు రాజ్యముల నాయకులు ఎనిమిదిమంది సంయుక్తముగా చేసిన ప్రకటనలో తమ సంప్రదింపులు సద్భావ పూరితమైన వాతావరణంలో జరిగినవని, కామన్వెల్తు సంస్థను, దాని కార్య విధానాలను, పరిణత పరిస్థితుల కనుగుణముగా మార్చుతూ, లక్ష్య సాధనతో ఐక్యతను సంఘటిత పరచుకొనుటకు కామన్వెల్తుకు సంప్రదాయసిద్ధముగా ఉన్న సామర్థ్యము పునః స్పష్టమైనదని తెలియజేశారు.

శాంతి స్వేచ్ఛ, అభ్యుదయముల కొరకు యధేచ్ఛగా సహకరిస్తూ తామంతా సమైక్యతతో, సరిసమాన హోదాతో, కామన్వెల్తులో స్వతంత్ర రాజ్యములుగా మెలగు మందుమని బ్రిటన్, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, దక్షిణాఫ్రికా, ఇండియా, పాకిస్థాన్ సింహళ దేశములు సంయుక్తముగా ప్రకటించినవి.

### అధికార ప్రకటన

డౌనింగ్ వీధి 10 నెం భవనం నుంచి నేడీ అధికార ప్రకటన వెలువడింది.

"క్రిందటి వారమల్లా, బ్రిటిష్, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, దక్షిణాఫ్రికా, ఇండియా పాకిస్థాన్, సింహళ ముల ప్రధానమంత్రులు, కెనడా విదేశాంగ మంత్రి, లండన్‌లో సమావేశమై, భారతదేశం నూతనరాజ్యాంగ వ్యవస్థననుసరించి రిపబ్లిక్‌గా తీర్మానవలెనని నిశ్చయించు కొన్నప్పటికీ కామన్వెల్తులో సభ్యత్వ రాజ్యముగనే ఉండవలెనని అభిలాష పడుటవల్ల ఉత్పన్నమయ్యే అత్యంత ప్రధానమైన రాజ్యాంగసమస్యపై తమ తమ అభిప్రాయములను పరస్పరం తెలుపుకొన్నారు.

రిపబ్లికన్ భారతదేశము కామన్వెల్తులో ఉండుటవల్ల యిప్పటి కామన్వెల్తు వ్యవస్థలోగాని, కామన్వెల్తు సభ్యత్వ రాజ్యముల పరస్పర సంబంధములలో గాని ఎలాంటి మార్పులు, ఏర్పడగలవు? అన్న విషయంపైనే, కామన్వెల్తు ప్రధానుల చర్చలు సాగినవి. ఈచర్చలు, సద్భావపూరితమైన వాతావరణంలో పరస్పర అవగాహనతో నడచినవి.

కామన్వెల్తులోని అన్ని అధినివేశ ప్రభుత్వముల తరఫున యిక్కడకు వచ్చిన ప్రతినిధులు, సమగ్రమైన చర్చల పర్యవసానమైన తమ నిర్ణయములను, యీ దిగువ ప్రకటనలో పొందుపరచుటకు అంగీకరించారు.

"బ్రిటిష్ కామన్వెల్తులో సభ్యత్వము గలిగి సమైక్యతతోనున్నట్టి బ్రిటిష్ సింహా

(2 వ పేజి చూడుము)

### దక్షిణ ఆఫ్రికా భారతీయ ప్రధానుల సమావేశం

లండన్, ఏప్రిల్ 27: ఇండియా దక్షిణాఫ్రికా ప్రధాన మంత్రులకు ఇవాళ ప్రథమ పర్యాయంగా సమావేశం జరిగినది. పండిట్ నెహ్రూ, డా॥ డేనియల్ మాలన్‌ను తనతో మధ్యాహ్నం భోజనానికి ఆహ్వానించాడు. ఇండియా-దక్షిణ ఆఫ్రికాతో వాణిజ్య సంబంధములు తెంచుకున్న తర్వాత ఉభయులూ కలుసుకోవడం ఇదే ప్రథమ పర్యాయం. దక్షిణాఫ్రికా కామన్వెల్తు సంభాషణలలో ఇండియా యెడ చాలా సానుభూతి ప్రదర్శించినదని భారతీయ రాయబార వర్గంవారు ఏక వాక్యతగా అంటున్నప్పటికీ ఈఉభయ ప్రధానమంత్రుల సమావేశమునకు ప్రత్యేక రాజకీయ ప్రాధాన్యం ఉన్నదని చెప్పటానికి ఎవ్వరూ సాహసించడం లేదు.

### అమెరికా సైనిక శాఖ కార్యదర్శి పదవి

వాషింగ్టన్, ఏప్రిల్ 27: అమెరికా సైనిక శాఖ కార్యదర్శి పదవిని తాను అంగీకరించ లేదనీ, మరి 60 రోజుల వరకు కూడ అంగీకరించననీ, ప్రధాన ప్రజోపయోగ సంస్థ సభ్యుడు కర్టిస్ ఇ. గాల్డర్ నేటి రాత్రి చెప్పెను. ఇతను ఆపదవిని అంగీకరించినట్లు నేటి ఉదయం వదంతి బయలుదేరింది.

## బర్మా విషయమై కామన్వెల్తు ప్రధానుల చర్చ

### ప్రధాని థాకిన్‌నూకోర్కెల విశదీకరణ

లండన్, ఏప్రిల్ 27: బ్రిటన్, ఇండియా, పాకిస్థాన్, న్యూజీలెండ్‌ల ప్రధానులు నేడు బ్రిటిష్ ప్రధాని నివాస భవనమైన డౌనింగు వీధిలోని 10 వ నెంబరు ఇంటిలో కలుసుకుని బర్మా విషయమై చర్చలను ప్రారంభించారు. బ్రిటిష్ విదేశాంగమంత్రి బెవిన్ కూడా ఈ చర్చలలో పాల్గొన్నాడు. కాని బర్మాకు సన్నిహిత దేశమయిన సింహళ ప్రధాని ఈ సమావేశంలో పాల్గొనలేదు. ఆయనకు బదులు ఒక ప్రతినిధి ఈ చర్చలలో పాల్గొన్నాడు.

ఈ మధ్య బర్మాప్రధాని థాకిన్‌నూ ఇండియాకు వచ్చినప్పుడు కలకత్తాలో ఒక ప్రకటన చేస్తూ కామన్వెల్తు ప్రధానుల సమావేశంలో బర్మాప్రసక్తి తీసుకుని రావటానికి ఇండియా, పాకిస్థాన్ ప్రధానులు అంగీకరించారని తెలియజేశాడు. కాని నేటి సమావేశంలో బ్రిటిష్ ప్రధాని అట్లీయే బర్మా విషయాన్ని తీసుకుని వచ్చాడని తెలుస్తున్నది. సమావేశానికి ప్రధాని అట్లీ అధ్యక్షత వహించగా పండిత నెహ్రూ, లియాకతాలీఖాన్‌లు థాకిన్‌నూ తమకు తెలియజేసిన వివరాలను వెల్లడించి, బర్మా పరిస్థితులపై తమ సొంత అభిప్రాయాలను కూడా వివరించారని తెలుస్తున్నది.

### థాకిన్‌నూ కోరిక

బర్మాప్రధాని థాకిన్‌నూ ఇండియా పాకిస్థాన్ ప్రధానులను కలుసుకున్నప్పుడు బర్మాపట్ల తనవైఖరిని స్పష్టపరుస్తూ బ్రిటిష్ ప్రభుత్వం ఒక ప్రకటన చేసేట్లుగా వారు ప్రయత్నించాలని కోరినట్లు తెలుస్తున్నది. ప్రస్తుతం సందిగ్ధంగా ఉన్న బ్రిటిష్ వైఖరి స్పష్టపడితే బర్మాలోని అనేక రాజకీయ వర్గాలకు సంతృప్తి కలుగుతుందని బర్మాప్రభుత్వం భావిస్తున్నట్లు విశ్వసనీయ వర్గాల వలన తెలుస్తున్నది.

### కామన్వెల్తులో చేరదు

భారత రిపబ్లిక్ కామన్వెల్తులో ఉండటానికి వీలుగా కామన్వెల్తు సంబంధాలలో మార్పులు జరిగినవి కనుక ఈ కొత్త సంబంధాలను పురస్కరించుకొని బర్మా రిపబ్లిక్ కూడా తిరిగి కామన్వెల్తు చేరవచ్చునేమో నని ఇక్కడ జరుగుతున్న ఊహాగానాన్ని అభిజ్ఞవర్గాలు త్రోసివేస్తున్నారు.

### పండిత నెహ్రూ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 27: భారతప్రధాని పండిత నెహ్రూ మే 7వ తేదినాటికి కామన్వెల్తు ప్రతినిధుల సమావేశ కార్యక్రమాన్ని ముగించుకుని ఇండియాకు తిరిగి రావలసియున్నది. ఇండియాకు తిరిగి వస్తూ ఆయన దారిలో కొంతకాలం స్విట్జర్లండ్‌లో ఆగునని తెలుస్తున్నది.

## 500 వస్తువులపై కంట్రోల్ రద్దు

### అమెరికా నిర్ణయం

వాషింగ్టన్ ఏప్రిల్ 27: అమెరికా నుంచి ఎగుమతి చేయబడు దాదాపు 500 రకాల వస్తువుల పై ఎగుమతి కంట్రోలు రద్దు చేయబడినవని వాణిజ్య శాఖ నేడు ప్రకటించింది. దీని ప్రకారం, ఆ వస్తువులను రష్యా యూరోపు దేశాలకు గాని ప్రపంచంలోని ఏ యితర ప్రదేశానికైనా గాని ఎగుమతి లైసెన్సు లేకుండానే ఎగుమతి చేయవచ్చును.

### డబ్లిన్‌కు నెహ్రూ ప్రయాణం

#### ఘనమైన స్వాగతమివ్వడానికి ఐర్ సన్నాహాలు

డబ్లిన్, ఏప్రిల్ 27: భారత ప్రధాని పండిట్ జవహర్లాల్ నెహ్రూ రేపు లండన్‌నుండి డబ్లిన్ వెళ్లును. నెహ్రూ డబ్లిన్‌లో 5 గంటలకన్న ఎక్కువసేపు ఉండరు. తమతో నెహ్రూ ఇంతకన్న ఎక్కువ సమయం గడపడానికి అవకాశం లేనందుకు ప్రజలు తీవ్ర నిరాశ చెందుతున్నారు. ఒక రాజకీయ నాయకుని ఆగమనం ప్రజలలో ఇంత గాఢమైన ఔత్సుక్యం రేకెత్తించడం ఇదే ప్రథమం.

పండిట్ నెహ్రూ ప్రత్యేక విమానంలో సర్ గిరిజాశంకర్ బాజ్పాయ్ కృష్ణమీనన్ గారలతో కలిసి డబ్లిన్ విమానాశ్రయమునకు ప్రొద్దున 9 గం. కు వచ్చును.

విమానాశ్రయం వద్ద పండిట్ నెహ్రూ ప్రభృతులకు ఐర్లెండు ప్రధాన మంత్రి జాన్ కాస్టిలో స్వాగత మిచ్చును. ఐర్లెండు విదేశాంగమంత్రి డా॥ నోయెల్ బ్రౌన్‌తో కలిసి ఫీనిక్స్ పార్కుకు వెళ్లి పండిట్ నెహ్రూ ఐర్లెండు అధ్యక్షుడైన సీన్ ఓకెల్లీని కలుసుకొనును.

కాజిల్‌లో విదేశాంగ వ్యవహారశాఖ కార్యాలయము పండిట్ నెహ్రూను ఆయన పరివారమునకు విందు జేయును. అక్కడ డివాలెరా ప్రతికూలపక్ష నాయకుడైన బ్రెండన్ ఐకెన్ ప్రభృతులు పండిట్ నెహ్రూను కలుసుకొనెదరు.

పండిట్ నెహ్రూ రేపే లండన్‌కు విమానములో తిరిగి వెళ్లును.

### ముగ్గురు పౌరుల హత్య

#### మాజీ సైనికుల దురాగతం

హైదరాబాద్, ఏప్రిల్ 27: ఖాకీ దుస్తులలోనున్న 6 గురు మాజీ సైనికులు ఏప్రిల్ రెండవవారంలో మెదక్ జిల్లాలోని కర్తాల్ గ్రామంపై దాడిచేసి ఇద్దరు మనుష్యులను, ఒక ఆడపిల్లను హత్య చేసినారని యిక్కడకు వార్తలు వచ్చినవి. ఇంతేగాక వీరు ఒకగృహమును దహనం చేసి రూ. 6000 ల ఆస్తినికూడ దోచుకొన్నారట.

## 'ధైర్యమైన మహత్తమమైన నిర్ణయం'

### కామన్వెల్తు ప్రధానులసభ తీర్మానం: సర్దార్ పటేల్ అభిప్రాయం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 28: "భారతదేశము బ్రిటిష్ సింహాసనముతో సంబంధమును విడనాడుకొన్న స్వతంత్రరాజ్యముగా నుండినప్పటికి బ్రిటిష్ రాజ్యకూటములో సభ్యత్వము కలిగియుండ వచ్చునని తీర్మానించుచు బ్రిటిష్ కామనువెల్తు రాజ్యాల ప్రధానమంత్రుల సభయందు లండనులో చేయబడిన నిర్ణయము మహత్తమమైనది. ధైర్యముగా చేయబడిన నిర్ణయమది. పరస్పర సద్భావ సుహృద్భావముల వల్లనే యీ రాజ్యకూటముతో సంబంధము స్థిరస్థాయిగా నుండగలదు." అని కామన్వెల్తు ప్రధానుల సభ చేసిన నిర్ణయమును గూర్చి భారత ప్రభుత్వ ఉప ప్రధాని సర్దారు వల్లభాయి పటేలు గారు నేడు పత్రికా ప్రతినిధుల సమావేశంలో ఉద్ఘాటించిరి.

అట్టి పరస్పర సద్భావమునకై మనము కృషిచేయుదుముగాక," ఈ కామన్వెల్తు రాజ్యాలసభలో మొదటినుండియు భారతదేశ ప్రధానమంత్రి యొడల ఆ సభలోని వారందరును సౌజన్య సద్భావములనే కనపరచిరి. స్వతంత్ర రిపబ్లికు (ప్రజా రాజ్యము) కానున్న భారతదేశమునకు బ్రిటిష్ రాజ్య కూటమిలో ఎట్టియెడను స్థానమును కల్పించవలెననే పట్టుదలను కనుబరచిరి. బ్రిటిష్ రాజ్య కూటమునకు నామకరణము మారినది. ఇకముందునుండియు అది రాజ్యముల సమష్టి కూటమని పిలువబడుచుండును. దాని అంగనిర్మాణములో మార్పుకలిగినప్పుడు పేరుకూడా విధిగా మారవలసియున్నది. భారతదేశము సర్వస్వతంత్ర ప్రజా పరిపాలిత రాజ్యంగా ఉండవచ్చును. ఈ ప్రజా రాజ్యమునకు బ్రిటిష్ రాజుతో ఏవిధమైన సంబంధము లేదు. కాని, ఈ రాజ్యాల కూటమునకు బ్రిటిష్‌రాజు గౌరవార్థముగా అధిపత్యము వహించి యుండును. బ్రిటిష్ రాజ్య కూటంలో భారతదేశమునకు గల సంబంధము విడిపోకుండానే యుండగలదు. భారత దేశ నూతన రాజ్యాంగ విధానము ప్రకారముగా స్వదేశాంగ వ్యవహార ముండును. విదేశాంగ వ్యవహారములందును కూడ భారత దేశము సర్వ స్వతంత్రంగా వ్యవహరించు నట్టిదై యుండును. ఈ విధముగా బ్రిటిష్ కామనువెల్తు కూటము భారత దేశానికి అనుకూలంగా తన తత్వమును మార్చుకొనుట పండిత నెహ్రూ గారు సాధించిన విజయమని చెప్పవచ్చును.

ఈ కామనువెల్తు కూటమునకు నామమాత్రాధిపత్యం వహించెడి బ్రిటిష్‌రాజు నిర్వర్తించ గల అధికారము లేవియు లేవు. ఈ రాజ్య కూటములో చేరిన రాజ్యములకు గల ఏకైక లక్ష్యమునకు లాంఛన మాత్రమైన చిహ్నముగా బ్రిటిష్ రాజు పెద్దరికము వహించును.

ప్రశ్న: బ్రిటిష్‌రాజు ఇదివరకు కూడా లాంఛనమాత్రముగా పెద్దరికమును వహించియుండెను. కనుక, కామనువెల్తు కూటమునకు ఆధిపత్యము వహించుటలోను ఇండియాగవర్నమెంటుకు ఆధిపత్యము వహించుటలోను వ్యత్యాసమేమున్నది?

సర్దారు పటేలు: బ్రిటిష్‌రాజు ఇండియాగవర్నమెంటుకు అధిపతియగుటలోను కామనువెల్తు కూటమునకు అధిపతియగుటలోను చాలా వ్యత్యాసమున్నది.

ప్రశ్న: లాంఛనమాత్రమైన చిహ్నంగా ఉండుట యనగా నేమిటి?

సర్దారు పటేలు: అందుకు అర్థం కావాలంటే నిఘంటువును చూచుకోండి. (నవ్వు.)

ఇప్పుడు ఏర్పడిన ఒడంబడిక ననుసరించి కామనువెల్తు కూటంలో చేరిన ఏ రాజ్యమైనను అందులోనుంచి విడిపోవుటకు హక్కును కలిగియున్నది. అట్టి హక్కునకు యీ ఒడంబడికవల్ల భంగము కలుగుట లేదు.

మన ప్రధానమంత్రి నెహ్రూ ఇండియాకు తిరిగిరాగానే ఇండియా మంత్రివర్గమునకు అక్కడ లండనుసభలో జరిగిన వ్యవహారమునంతయు నివేదించును. అటు పిమ్మట మన రాజ్యాంగపరిషత్తు ఆ లండనుసభ నిర్ణయమును ఆమోదించి ఖాయపరచవలెను. కామనువెల్తు రాజ్యాల ఒడంబడిక అ. భా. కాంగ్రెసు వర్కింగు కమిటీకి కూడా నివేదింపబడును.

ప్రశ్న: కమ్యూనిస్టులు సోషలిస్టులు యీ నిర్ణయమును ప్రతిఘటించగలరు గదా? వారితో మీరు ఎట్లా వ్యవహరిస్తారు?

సర్దారు పటేలు: వారికి సామాన్య

(2 వ పేజి చూడుము)

### డి. డి. టి. ద్వారా మలేరియా నిర్మూలనం

#### మద్రాసు ప్రభుత్వం ఆలోచన

మద్రాసు, ఏప్రిల్ 27:— డి. డి. టి. "స్ప్రేయింగు సర్వీసు"ను ప్రవేశపెట్టాలని మద్రాసు ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు తెలుస్తున్నది. ప్రభుత్వ వ్యయంతో శిక్షణ పొందిన దళాలు రాష్ట్రంలోని అన్ని మునిసిపాలిటీలలోనూ నియమించబడగలవు. ఈ ప్రణాళిక ననుసరించి ప్రతి మునిసిపల్ ప్రాంతంలో నున్న ప్రతి ఇంటిలోనూ డి. డి. టి. చల్లబడుతుంది. మొదటి సంవత్సరానికయ్యే వ్యయంతో సగాన్ని ప్రభుత్వం భరించవచ్చును. రాబోయే సంవత్సరాలలో ఈ సర్వీసు స్వయంపోషకం కాగలదని ప్రభుత్వం ఆశిస్తున్నది.

మలేరియా దోమల నాశనాని కుద్దేశించబడిన ఈ ప్రణాళిక వివరాలను మద్రాసు ప్రభుత్వ మలేరియా విభాగం తయారు చేస్తోంది. —గ్లోబ్

## వెలువోలులో కమ్యూనిస్టులు జరిపిన దురంతాల వివరం

మచిలీపట్నం, ఏప్రిల్ 28 దివి తాలూకా వెలువోలు గ్రామంపై నిన్న తెల్లవారుజామున కమ్యూనిస్టులు జరిపిన దాడి వివరములు తెలియవచ్చినవి. వెలువోలుకూ, ఆ చుట్టుపట్ల 5 మైళ్లమేరలో గల గ్రామములకూ చెందిన 200 మంది కమ్యూనిస్టులు మిలిటరీ యూనిఫారముల లాంటి దుస్తులు ధరించి, మారణాయుధములూ, టార్చిలైట్లూ పుచ్చుకొని ముందు వెలువోలును ముట్టడించిరట. ఆపైన ఇరవై మంది, పాటికమందిగల ముఠాలుగా చీలి మొత్తం 11 ఇళ్ళను ముట్టడించిరట. ఈ ఇళ్ళలో చాలాభాగం కాంగ్రెస్ సేవాదళానికి చెందినవారివి. తలుపులు పగలగొట్టి, కిటికీలను పెల్లగించి, ఇళ్ళల్లోవారిని వీధిలోనికి ఈడ్చుకువచ్చిరట. కమ్యూనిస్టు నివసించే ప్రాంతంనుంచి వీరికి సహాయం రాకుండా కొందరు కమ్యూనిస్టులు కాపలా వుంచిరట. కోనేరు రాఘవయ్య, దేవాబత్తిన శీనయ్య అను సేవాదళ సభ్యులను చంపివేసిరి. కోగంటి వెంకటేశ్వర్లు అనే కమ్యూనిస్టు శవం సమీపంలోని పొలంలో కనిపించిందట. శవం బరిశపోట్లతో నిండివున్నదట. తీవ్రమయిన గాయములు తగిలిన 5 గురిని నిన్న ఇచ్చట ఆస్పత్రికి తీసుకువచ్చిరి. పలువురికి చిన్న చిన్న గాయములుతగిలినవి. ఈదురంతం మొత్తం రెండుగంటలసేపు జరిగినదట. దాడిచేసిన వారు కమ్యూనిస్టు నినాదములు చేయుచు, మళ్ళీ ఇట్లాగే భరతంపడతామని ప్రజలను బెదరించుచు, ఇళ్లల్లో దోచుకొన్న సొమ్ముతో పారిపోయిరి. దోపిడీ అయిన సొమ్ము వెండి, బంగారు వస్తువులు, రొఖ్ఖము కలిసి సుమారు రు. 10,000/-లు విలువ చేయునని అంచనా వేయబడింది. ఈ దాడి రహస్యంగా చర్చిస్తున్న కమ్యూనిస్టుల ప్రోద్బలంతో, కట్టుదిట్టముగా జరిగినట్లు భావించుచున్నారు.

డి. వై. ఎస్. పి. డి. సుబ్బారావు, సబ్ డివిజనల్ మేజస్ట్రేటు కె. పి. శామ్యూల్ పెద్ద పోలీసు బలగంతో ఆ గ్రామంలో మకాం చేయుచున్నారు. ఆక్టింగ్, డి ఎస్. పి. పృథ్వీరాజ్ సింగ్ స్పెషల్ డి. వై ఎస్. పి. థామస్, స్పెషల్ బ్రాంచ్ పోలీస్ డి. వై. ఎస్. పి. కృష్ణస్వామి నాయుడు కూడ వెలువోలు వెళ్ళిరి. ఉత్తర ప్రాంతి డి. ఐ. జి. పార్థసారథి ఎస్. అయ్యంగార్ నాల్గోరు నుంచివిజయవాడ వచ్చివెలువోలు వెళ్లిరి. అడిషనల్ డిస్ట్రిక్టు మేజస్ట్రేటు జి. భీమశంకరం కూడా ఆగ్రామం వెళ్ళి చూచిరి. గాయపడిన కాంగ్రెస్ వాదుల పేర్లు కోనేరు బసవయ్య, కోనేరు సత్యనారాయణ, కోనేరు సుబ్బయ్య టి. వెంకట్రామయ్య, కోనేరు రామకోటయ్య. ఇందులో బసవయ్య గారి కళ్లను కమ్యూనిస్టులు పెరికివేసిరి. మిగిలినవారి కాళ్లుకీళ్లు తొలగింపబడినవి.

కమ్యూనిస్టు వ్యతిరేకులనందర్ని హత్య చేయాలన్న కమ్యూనిస్టు ప్రజాకోర్టు తీర్మానాన్ని అనుసరించి ఈయత్నాలుజరుపబడినట్లు తెలియుచున్నది.

# "చెన్నపట్నాన్ని ప్రత్యేక రాష్ట్రంగా నిర్మించవలెను"

## నగరవర్తక ప్రముఖుల తీర్మానం

చెన్నపట్నం, ఏప్రిల్ 23: "బొంబాయి నగరమువలె చెన్నపట్నం కూడా ప్రత్యేక రాష్ట్రముగా నిర్మించవలెనని శ్రీ ఎన్. రామారావుగారి అధ్యక్షతను గిడ్డంగివీధి బట్టల వర్తకుల భవనంలో జరిగిన బహిరంగసభలో తీర్మానించబడెను.

ఎ. ఎల్. పాండ్యాగారు చెన్నపట్నం బహుభాషలవారి కృషితోను, భాగ్యముతోను వృద్ధికి వచ్చినదనియు బొంబై నగరమునకొక న్యాయము, చెన్నపట్నమునకు మరో న్యాయము కూడదనిరి. చెన్నపట్నం మిలిటరీ దృష్ట్యాకూడా ప్రధానమైనదనియు కేంద్రప్రభుత్వం దీనిని ప్రత్యేక రాష్ట్రముగా సృష్టించవలెననిరి.

అధ్యక్షులు, చారిత్రకముగను ఆర్థికముగను ఆంధ్రుల జీవనముతో పెనవేసుకొనివున్న చెన్నపట్నమును త్యజింపమను సలహాను ఆంధ్రులు సులభముగా జీర్ణించుకొనలేరనిరి. చెన్నపట్నమును సమష్టిగా ఉంచటమే సర్వజనులకు యుక్తమూ, సంతృప్తికరమూ అయిన పరిష్కార మార్గమనిరి.

చెన్నపట్నమును ప్రత్యేక రాష్ట్రముగా చేయవలెను తీర్మానమును లాడ్ గిరిధరదాసుగారు ప్రతిపాదించగా జి. రాజమన్నారుగారు బలపరచిరి. నాయకత్రయ నివేదిక చాలా న్యాయముగను నిష్పక్షముగను ఉన్నదని సుబ్బరత్నం, రంగనాథం చెట్టిగారలు చెప్పి తీర్మానమును ఎదిర్చిరి.

ఆర్. సాంబశివరావుగారు చెన్నపట్నాన్ని ప్రత్యేక గవర్నరు రాష్ట్రముగాచేసిన అందరికీ న్యాయముచేసిన ట్లగుననిరి. తీర్మానమును అధిక సంఖ్యాకులు ఆమోదించిరి.

సభను జయప్రదముగా గోరుమూకొంతి రామమూర్తిగారు చెన్నపట్నం బహుభాషా ప్రాంతమనియు, దక్షిణ భారత వాణిజ్యమునకు సారస్వతమునకు కూడలి నగరమనియు, సమష్టి రాజధానిగా ఉండవలెననియు సందేశము పంపిరి. ఆంధ్రులు తమిళులు వేర్వేరు రాజధానులు పెట్టుకొన్నచో చెన్నపట్నం నాల్గు రాష్ట్రముల సమాఖ్య నగరముగా గాని, కేంద్ర ప్రభుత్వ పాలిత నగరముగా గాని ఉండవచ్చుననిరి.

### చెన్నపట్నంకై పిడివాదము కూడదు

దర్శి చెంచయ్యగారు (మద్రాసు) ఇట్లు తెలుపుతున్నారు:—"నాయక త్రయము వారొక విధముగా తీర్పు ఇచ్చిన తర్వాతసరిహద్దుసంఘమువారు వ్యవహారము అన్యథా పరిష్కారము చేసెదరని తలంచుట అవివేకము. చెన్నపట్నమును ప్రత్యేకరాష్ట్రముగా చేసి ఉత్తరాది వారి చేతుల్లో ధారపోయుట కన్న తమిళులకే వప్పగించి వారి స్నేహమును, సౌమనస్యమును పొందుట వివేకము. హైద్రాబాదును ఆంధ్ర రాజధానీ నగరముగ చేసుకొనుటో, బెజవాడ దగ్గర రాజధాని పెట్టుకొనుటో మంచిది. చెన్నపట్నం విషయమై పిడివాదము లేకుండా ఇప్పుడే వదలుకొని స్నేహముతో విడిపోవుట ఉత్తమము. రాజనీతి చాతుర్యమునకు తార్కాణము. అప్పుడు ఎన్నూరు దగ్గిర నుంచైనా మన సరిహద్దు వదలండని అడుగుటకు ఆస్కారము ఉండును."

### వదలుకోవచ్చు

శ్రీ వాదమునిరెడ్డి (ఎం. ఎల్. ఎ.)గారిట్లు తెలుపుచున్నారు:

"చెన్నపట్నాన్ని ఒక విధంగా అయితే ఆంధ్రులు వెంటనే వదలుకొని రాష్ట్రము సంపాదించవచ్చు. హైద్రాబాదు రాజధానీనగరము గావచ్చునని ఆంధ్ర నాయకులు ఖండితముగా చెప్పగల్గినట్లైతే చెన్నపట్నం వదలుకొనవచ్చు. చెన్నపట్నానికి రాయలసీమకు చిరకాలముగా అనిర్వచనీయమైన సంబంధము యేర్పడి ఉన్ననూ, తక్షణము ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు చెన్నపట్నమును వదలుకొనవచ్చును. అయితే హైద్రాబాదు రాజధాని అను మరతు, శ్రీబాగ్ ఒడంబడిక మన్నించు విషయము పండితీరవలెను.

## పుదుచ్చేరికి విమానాశ్రయం

పుదుచ్చేరి, ఏప్రిల్ 27: పుదుచ్చేరిలో ఒక విమానాశ్రయ మేర్పరుపబడునని ఒక వార్త తెలుపుచున్నది. ఇట్టి విమానాశ్రయము నేర్పరుచుటకు పని యిదివరకే ప్రారంభమైనది.

## 'చెన్నపట్నాన్ని ఎన్నటికీ వదిలిపెట్టం'

### ఆంధ్ర హరిజనసంఘ తీర్మానము

చెన్నపట్నం, ఏప్రిల్ 28: ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం విషయమై నాయకత్రయ కమిటీ చేసియున్న సూచనలు ఆంధ్రులకు అంగీకారం కావనియు చెన్నపట్నము మీద హక్కును ఆంధ్రు లెన్నటికీ వదలుకొనజాలరనియు చెన్నపట్నమును ఆంధ్రరాష్ట్రం ముఖ్యపట్నముగా చేయవలెననియు అది సాధ్యపడని పక్షంలో దానిని ఆంధ్ర తమిళరాష్ట్రాల ఉమ్మడి రాజధాని పట్నముగా చేయవలెననియు కోరుతూ నిన్న సాయంత్రం గాంధీనగరునందు ఆంధ్ర హరిజనసంఘము బాపూజీ యువకసంఘముల యాజమాన్యమున జరిగిన బహిరంగ సభలో తీర్మానము ఏకగ్రీవముగా గావింపబడెను.

సభకు అధ్యక్షత వహించిన శ్రీ బులుసు సాంబమూర్తిగారు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమునకై ఆంధ్రులు యిన్నాళ్లుగా సాగించిన ఆందోళన చరిత్రనంతా సాంతముగా వివరించిరి. 1916 లో కాకినాడలో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడవలెనని ఒక తీర్మానం గావింపబడెను. ఆతరువాత కర్నాటకులు మహారాష్ట్రులు సయితం భాషా రాష్ట్రాలుగా రాష్ట్ర విభజన జరుగవలెనని కోరినారు ఆ తీర్మానం 1917 కాంగ్రెస్‌లో అంగీకరింపబడెను. 1916 లో చెన్నపురిలో ఆంధ్ర మహాసభ శ్రీ పిట్టి త్యాగరాయ చెట్టిగారి ప్రథమ అధ్యక్షత క్రింద ప్రారంభింపబడినది. ఆంధ్ర రాష్ట్రమును విడదీయవలెనని కాంగ్రెస్‌లో తీర్మానము అయిన ఫలితముగా ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘము ఏర్పడ్డది. 1920 నుండి కాంగ్రెస్ నందు భాషా సిద్ధాంతము ప్రకారము రాష్ట్ర కాంగ్రెస్ సంఘాలేర్పడినవి. అప్పటినుండి చెన్నపట్నములో ఆంధ్రులు తమిళులు ఉభయులూ వేర్వేరుజిల్లా సంఘాలేర్పరచి ఉమ్మడిగా వ్యవహారములను సామరస్యముతోనే నిర్వహించుకొంటూ వచ్చిరి. ఆంధ్రుల రాష్ట్రవాంఛ ఉత్సాహమునుచూచి 1923 ఆ ప్రాంతములో తమిళులుకూడా రాష్ట్రం కావాలని కోరుటకు ప్రారంభించిరి. అపుడు సర్ శంకరన్ నాయర్ స్టేట్ కౌన్సిలులో తమిళరాష్ట్రం కావాలని కోరిన తీర్మానములో మదరాసును కోరక అది ఉమ్మడినగరముగానే యుండుట భావ్యమనే ఉద్దేశ్యము కనబరచియుండిరి. ఆనాటినుండి యీనాటివరకు జరిగిన ఆందోళనమంతా ఆంధ్రరాష్ట్రమునకు చెన్నపట్నము రాజధానిపట్నముగా నుండవలెననే జరిగినది. ఇంతకథ జరిగియుండగా యిపుడు ఆంధ్రులు చెన్నపట్నంమీద పూర్తిగా హక్కు వదలుకుంటేగాని రాష్ట్రనిర్మాణముగూర్చి ఆలోచన జరుగదని త్రిమూర్తుల కమిటీ వారు చెప్పుట ఏమి న్యాయమనిరి. ఫార్ కమిటీ సయితము చెన్నపట్నమును ప్రత్యేక రాష్ట్రముగా నుంచవలెనని సూచించియుండ యీకమిటీ సిఫార్సు దానికి మించిపోయియున్నదనియు ఆంధ్రు లిట్టి తీర్పును ఎన్నటికిని అంగీకరించలేరనియు ఆయనగారు నుడివిరి.

శ్రీ ఆర్. సుబ్బయ్యనాయుడుగారు మదరాసును విడుచుటకు చెన్నపట్నం ఆంధ్రులు ఒప్పుకొనరనిరి.

శ్రీ భాగవతుల లక్ష్మీనారాయణ అవ్వకేటుగారు పై తీర్మానము ప్రతిపాదించుచూ చెన్నపట్నం మీద ఆంధ్రులు తమహక్కును ఎన్నటికిని వదలుకొనజాలరనియు, ఆ విషయముగా ఒప్పుకుంటూ నివేదికలో ఆంధ్రుల తరఫున సంతకము చేయు రాష్ట్రపతి డా॥ పట్టాభిగారికి సయితము హక్కులేదనియు తెలిపిరి. విలియంసు, వి. సి. గోవిందుగార్లు తీర్మానమును బలపరుస్తూ చెన్నపట్నమును ఎవరు వదల వలచుకొన్ననూ నగరములో నుండే 40 వేలమంది ఆంధ్ర హరిజనులెన్నడూ ఆ కార్యమునకు సమ్మతింపరనియు నుడివిరి.

శ్రీ వేమారెడ్డిగారు చెన్నపట్నం ఉమ్మడి నగరముగా తప్పక నుంచవగునని తెలుపుటకు కనీసం ఒకలక్ష ఆంధ్రుల సంతకాలైనా తీసి కాంగ్రెసు పెద్దలకు కేంద్ర ప్రభుత్వమునకు పంపి అందుకుతగిన ఆందోళనము సాగించవలెననిరి.

డె॥ క॥ శంకర శాస్త్రిగారు త్రిమూర్తుల కమిటీ ఆంధ్రులకు చాలా అన్యాయం చేసి యున్నదనిరి. శ్రీ బెంజమిన్, పార్థసారథి కే. వి. స్వామిగారు కూడా సమగ్రాంధ్ర రాష్ట్రము కావలెననిరి.

## శ్రామికులకు గృహాలు

### రాష్ట్రాలకు కేంద్రప్రభుత్వ ఋణ సహాయం

కలకత్తా, ఏప్రిల్ 27: పారిశ్రామిక కార్మికులకు క్రొత్త యిండ్లు నిర్మించుటకుగాను వివిధరాష్ట్రీయప్రభుత్వములకు వడ్డీ లేకుండా ఋణము లివ్వ ఇండియా ప్రభుత్వమువారు గావించిన నిర్ణయమును ఇండియా ప్రభుత్వ కార్మికశాఖవారు ఒక లేఖ ద్వారా రాష్ట్రీయప్రభుత్వములకు తెలియజేసిరని తెలియుచున్నది. ఇందుకు కావలసిన పెట్టుబడి ద్రవ్యములో కేంద్రప్రభుత్వమువారు 2/3, రాష్ట్రీయ ప్రభుత్వమువారు 1/3 కార్మికయజమానికి ప్రభుత్వ సిఫారసుపై యిచ్చెదరు. ఇందుకై కేంద్ర ప్రభుత్వము రాష్ట్రములకు సబ్‌వెన్షన్ యివ్వదు. దీనిపై వడ్డీ యుండదు. కాని రాష్ట్రీయ ప్రభుత్వము వారుఋణ తీర్మానననిధిని యేర్పరుపవలసియుండురు. ఋణమిచ్చిన రెండేళ్లనుండి వారు సమాన వాయిదాలలో డబ్బువేసి, ఆ నాటినుండి 25 ఏండ్లలో బాకీతీర్చవలెను. ఇండ్లుయెట్టి ప్రమాణమునకు జెందినవిగా నుండవలెను? వానిని యే ప్రాంతములలో నిర్మించవలెను? అనువిషయమై రాష్ట్రీయ ప్రభుత్వములు కేంద్ర ప్రభుత్వమువారి ఆమోదము పొందవలెను. యజమాని చెల్లించవలసిన ద్రవ్యము అద్దె రూపమైనదిగా నుండును. మొత్తం ఖర్చులో 100 కి 3 వంతుల కంటె హెచ్చు అద్దె అతడు పుచ్చుకొనరాదు. ఇందుకుగాను కేంద్రప్రభుత్వము వెంటనే శాసనము చేయవలసియుండును.

పారిశ్రామిక కార్మికులకు క్రొత్త యిండ్లు కట్టించు పని బాగా సాగవలెనని కేంద్రప్రభుత్వమువారు ఆతురతజెందియుండుటచేత రాష్ట్రీయ ప్రభుత్వములు అంచనాలు పంపి తోడ్పడవలెనని కార్మిక శాఖవారు కోరియున్నారు.

### పరిశ్రమలకు రక్షణ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 27: 'మిశ్రలోహ పరిశ్రమ, పనిముట్ల పరిశ్రమ, ప్రత్యేక ఉక్కుల పరిశ్రమలకు రెండేండ్లవరకు అనగా 1951 సం॥ మార్చి 31 వరకు ప్రస్తుత పన్నురేట్ల ననుసరించి రక్షణయొసంగవలెననిటారిఫ్‌బోర్డు యిచ్చిన సలహాను ప్రభుత్వమువా రంగీకరించిరి.' అని ఒక ప్రభుత్వ ప్రకటన తెలుపుచున్నది.

## థాకిన్‌నూ ప్రభుత్వంతో చివరివరకు పోరాటం

### పీపుల్సు డెమాక్రాటిక్ ఫోర్సు ప్రకటన

రంగూన్, ఏప్రిల్ 27: పీపుల్సు వలంటీరు ఆర్గనిజేషన్‌కు చెందిన కమ్యూనిస్టులు, ప్రభుత్వం సైన్యం నుండి వెళ్లిపోయిన సైనికులు సంఘటితమైన పీపుల్ డెమాక్రాటిక్ ఫోర్సు వారు 16 అంశాలతో కూడిన ప్రకటన ఒకటి చేశారు. మొదటి అంశం థాకిన్‌నూ ప్రభుత్వంతో చివరివరకు పోరాడటం. మిగిలినవి బురాక్రాటిక్ పరిపాలనా యంత్రాన్ని విచ్ఛిన్నం చేసి, ప్రభుత్వాన్ని కూలద్రోయటం, బురాక్రాటిక్ సూత్రాల కింద నిర్మింపబడిన సైన్యాన్ని సాయుధ బలాలను రద్దుచేయటం. ప్రస్తుత రాజ్యాంగాన్ని రద్దుచేసి నూతన రాజ్యాంగాన్ని తయారు చేయటం, విదేశీ పరిశ్రమల నన్నిటినీ జాతీయం చేయటం, కార్మికులకు దినమునకు 8 గంటలు పని అని నిర్ణయించటం, భూస్వామికవిధానాన్ని తొలగించటం, దేశంలోని అన్ని జాతులకు సమాన హక్కులు కల్పించటం, కొండప్రాంతాలలో స్వావాబ్వాల, నాయకులపాలనను రద్దుచేయటం, గుమాస్తాలు, ఉపాధ్యాయులు మొదలైనవారి జీవన ప్రమాణం పెంచటం స్త్రీలకు అన్ని హక్కులు యివ్వటం, థాకిన్‌నూ ఆట్లీ ఒడంబడికను రద్దుచేసి, బర్మాదేశానికి ఇతర దేశాలకు మధ్య సత్సంబంధాలను నెలకొల్పటం, మొదలైనవి. పీపిల్సు వలంటీరు ఆర్గనిజేషన్‌కు చెందిన తెల్లపట్టీ కమ్యూనిస్టు, తెల్ల జెండా కమ్యూనిస్టులు, ప్రభుత్వ సైన్యంనుండి వెళిపోయిన సైనికులు సంఘటితమైన పీపుల్సు డెమాక్రెటిక్ ఫోర్సువారు, ప్రోమ్ పరిపాలన బాధ్యతను యానీగ్‌మాంగ్ నాయకత్వాన 7 గురు సభ్యులతోనున్న సంఘానికి అప్పగించారు. ఎర్రజెండా కమ్యూనిస్టు నాయకుడు థాకిన్ సోయితర సంస్థలతో కలహించినాడనీ, అందుచే అతడు ప్రోం జైలులో నిర్బంధంలో ఉంచబడెననీ, తెలుస్తోంది.

# బెర్లిను దిగ్బంధన తొలగించడానికి సన్నాహాలు

## న్యూయార్కులో అమెరికను, రష్యను ప్రతినిధుల సమావేశం

న్యూయార్క్, ఏప్రిలు 27: బెర్లిను దిగ్బంధన తొలగించడానికి చేస్తున్న సంభాషణలు సాగించడానికిగాను అమెరికను, రష్యను ప్రతినిధులు న్యూయార్కులో నేడు పార్కు ఎవెన్యూలోని సోవియటు రాయబార కేంద్రంలో 4-30 కి సమావేశమౌతారట. అమెరికా రాయబారి డా॥ ఫిలిప్, సి. జేసప్ కున్నూ, సోవియెట్ విదేశాంగ ఉపమంత్రి జేకబ్ మాలిక్ కున్నూ ఇదివరలో జరిగిన చర్చలు ఈ సమావేశంలో కొనసాగించబడతవట.

తూర్పు పశ్చిమ జర్మనీ భాగాలలో గల రవాణా నిర్బంధాలను ఏకకాలంలో రద్దుచేయాలని రష్యా చేసిన సూచనకు పశ్చిమరాజ్యత్రయం వారి సమాధానాన్ని అమెరికా ప్రతినిధులు ప్రసక్తాటిస్తారట. రష్యాసూచన ఆమోదించబడుతుందట. బెర్లినుదిగ్బంధం పొడిగించడం అమెరికాకు ఇష్టంలేదనీ, అది తొలగిపోవచ్చుననీ, రెండు నెలలలో గాని ఒక నెలలోనేగాని విదేశాంగ మంత్రులు సమావేశం కావచ్చుననీ వాషింగ్టనులోని అధికారదులంటున్నారు.

బెర్లినులోని తూర్పు పశ్చిమ ప్రాంతాలలోగల నిర్బంధాలు శీఘ్రకాలంలో నే అంతమవులవని రష్యను అధికారులు విశ్వసిస్తున్నట్టు జర్మను వార్తలు వచ్చినవి. కార్ల్‌షార్‌స్ట్ (జర్మనీ) వద్దనున్న రష్యను కార్యకేంద్రంవారికి దిగ్బంధంతొలగించే ఏర్పాట్లు వెంటనే ఆరంభించవలసిందని మాస్కోనుండి తాఖీదువచ్చినట్లు రష్యను పరిపాలకవర్గాలకు సన్నిహితులైన వారు చెబుతున్నారు.

## బర్మా అంతర్యుద్ధం

### చైనా సరిహద్దున విషమపరిస్థితి

రంగూను, ఏప్రిల్ 27: డైకూవద్ద అయిదురోజులపాటు జరిగిన తీవ్ర యుద్ధంలో కరెన్ తిరుగుబాటుదారులు దాదాపు 500 మంది మరణించినట్లు ఈ రాత్రి వెలువడిన బర్మాప్రభుత్వ ప్రకటన తెలుపుతున్నది. డైకు పెగుజిల్లాలోని ఒక ముఖ్య రైలుకేంద్రం. పెగుజిల్లాలో నేడు సైనికశాసనం అమలుచేయబడింది. దక్షిణ బర్మాలో కరెన్లు థాటన్ పరిపాలనను స్వాధీనంచేసుకున్నారు.

చైనాజాతీయ ప్రభుత్వసేననుండివచ్చి వేసిన సైనికులు బర్మా తూర్పుసరిహద్దున ఉన్న కెంగ్‌టంగ్ సంస్థానంలో ప్రవేశించినట్లు ప్రభుత్వవర్గములు తెలుపుచున్నవి. చైనా - బర్మా సరిహద్దున పరిస్థితులు విషమించినట్లు తెలుస్తున్నది.

మాండలే నగరం యావత్తు శత్రువిముక్తమైనట్లు ప్రభుత్వసైనిక ప్రతినిధి ఒకడు తెలుపుతున్నాడు.

## బర్మానుండి 2,500 భారత కాందిశీకులు

రంగూన్, ఏప్రిల్ 25: బర్మాలో యుద్ధము జరుగుచున్న ప్రాంతములనుండి 2,500 భారత కాందిశీకులు నేడు 'జలదుర్గా' అనుసిండియావారి పొగఓడలో మద్రాసుకు బయలుదేరిరి. వీరితోకలిసి యిదివరకు మొత్తం 10 వేలమంది భారతీయులు, కరేన్ తిరుగుబాటు ప్రారంభమైన తరువాత భారతదేశము వచ్చివేసిరి. వీరిలో చాలామంది బర్మాలోపుట్టి పెరిగినవారు. కొందరు తమ బర్మీస్ భార్యలతో సహా వచ్చుచున్నారు.

# భారతరిపబ్లిక్కు స్థానం

[1-వ పేజీ తరువాయి]

ననందయైన సమష్టిగా భక్తివిధేయతలు ప్రకటించుచున్నట్టి, బ్రిటన్ కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, దక్షిణాఫ్రికా, ఇండియా, పాకిస్థాన్ సింహళదేశముల ప్రభుత్వములు, భారతదేశములో త్వరలోజరుగనున్న రాజ్యాంగపరిణామములను పరిశీలించినవి. త్వరలో ఆమోదింపబడనున్న క్రొత్తరాజ్యాంగ వ్యవస్థననుసరించి భారతదేశం సర్వస్వతంత్ర రిపబ్లిక్‌గా మారవలెనని, భారత ప్రజాబాహుళ్యం అకాంక్షించుచున్నట్లు, భారతప్రభుత్వం, కామన్వెల్తులోని మిగతా ప్రభుత్వములకు తెలియజేసినది.

రిపబ్లిక్‌గా మారినప్పటికీ, మిగతా రాజ్యములతోపాటు సమగ్ర సభ్యత్వము కామన్వెల్తులో ఉండదలచి కామన్వెల్తులోని స్వతంత్రరాజ్యములస్వేచ్ఛాపూర్వకమైన పరస్పర సహకారమునకు చిహ్నప్రాయముగను, తద్వారా కామన్వెల్తుకు అధిపతిగను అంగీకరించెదనని, భారత ప్రభుత్వం సుస్పష్టముగా ప్రకటించినది. భారతరిపబ్లిక్ కామన్వెల్తులో సభ్యత్వం గలిగి ఉన్నప్పటికీ మిగతారాజ్యములు కామన్వెల్తులో యేప్రాతిపదికపై సభ్యత్వముకలిగి ఉన్నవో, ఆ ప్రాతిపదిక మారదుకాబట్టి కామన్వెల్తులో మిగతా ప్రభుత్వములు, భారతదేశం, తాను చేసుకొన్న మరతుల ప్రకారం, కామన్వెల్తులో యిప్పటివలె సభ్యత్వము కలిగి ఉండుటకు సమ్మతించినవి.

కనుక బ్రిటన్, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ దక్షిణ ఆఫ్రికా ఇండియా పాకిస్థాన్ సింహళములు, శాంతి స్వేచ్ఛ అభ్యుదయములకు యథేచ్ఛగా పరస్పరం సహకరించి, పనిచేయుచూ,, సమైక్యతతో, సరిసమానమైన హోదాతో కామన్వెల్తు, లో సభ్యత్వ రాజ్యాలుగా నుండగలవని ప్రకటించుచున్నవి."

ఇవ్వాళ డౌనింగ్ వీధిలో జరిగిన సమావేశం ఆరవది. శుక్రవారంనాడు ఒకసమావేశము సోమవారంనాడు రెండు సమావేశములు, నిన్న రెండుసమావేశములు జరిగినవి.

కామన్వెల్తు ప్రధానుల సమావేశం జయప్రదంకావడం ఆట్లీ స్వయంగా సాధించిన ఘనకార్యమని వర్ణించుచున్నారు. సమావేశ చర్చలు ఒడుదుడుకులులేకుండా సాఫీగా నడవడానికి, ఆట్లీ అధ్యక్షతే ఎక్కువగా కారణమని అనుకొంటున్నారు.

ప్రధానులు నేటి సమావేశం ముగియగానే, తామొక అంగీకారమునకు వచ్చినట్లు రాజుగారికి తెలిపేనిమిత్తం బకింగ్‌హాం భవనమునకు వెళ్ళారు.

ఒక్కొక్క స్వతంత్ర రాజ్యమునకు ప్రాతినిధ్యం వహిస్తున్న నాయకులు; విడివిడిగానే రాజునకు సలహా ఇవ్వవలెనని, రాజ్యాంగ నిర్బంధనకాని, కామన్వెల్తు ప్రధానులెవరు తమతరఫున రాజుగారితో వ్యవహరించుటకు బ్రిటిష్ ప్రధాని ఆట్లీని ఎంచుకొనుటతో యీ యిబ్బంది తీరిపోయింది. బకింగ్‌హాం భవనంలో ముప్పావు గంట ఉండి ప్రధానమంత్రు లంతా తిరిగి వెళ్ళిపోయినారు. తమ తమ దేశములకు తరలిపోయే ముందుగా, కామన్వెల్తుప్రధానులు విడివిడిగా రాజును సందర్శించగల అవకాశం ఉన్నది.

ఆస్ట్రేలియా ప్రధాని జోసెఫ్ చిఫ్లీ రేపు ఉదయం విమానంలో స్వదేశానికి బయలుదేరుతాడు.

పాకిస్థాన్ ప్రతినిధి వర్గ సలహాదారుడు సర్ మహమ్మద్ జఫ్రుల్లా ఖాన్ యీ రాత్రికే న్యూయార్కుకు విమానంలో బయలుదేరుతాడని తెలుస్తుంది.

లండన్, ఏప్రిల్ 27: కామన్వెల్తు రాజ్యాలు చేసుకొన్న ఒడంబడిక ప్రకారము రాజును కామన్వెల్తు చిహ్నంగా ఇండియా ఆమోదించినప్పటికీ ఆయనకు రాజకీయమైన బాధ్యత ఉండదు. రిపబ్లికు అయినతరువాత ఇండియాకు ఎన్నుకోబడిన అధ్యక్షుడు ప్రజల స్వతంత్ర నిర్ణయాలను అమలుజరుపుతూ, ఇదివరలో రాజు నిర్వహించిన బాధ్యతలను నిర్వహిస్తాడు.

కామన్వెల్తు రాజు అధిపతి గాగల రాజ్యాంగం కాక, పరస్పర మైత్రి సంబంధాలుగల స్వతంత్ర రాజ్యాల సమాఖ్యగా ఉంటుంది.

కామన్వెల్తుకు రాజుపెద్దగా నిర్వచించబడినప్పటికీ ఇది ఒక పదవి కాదు.

ఈ ఒడంబడికలోని ముఖ్యాంశాలు:

వ్యాపారవిషయాలలో ఇండియాకు ఇంపీరియల్ ప్రిఫరెన్సుపూర్తిగాఉంటుంది

అధినివేశం అనే మాట రద్దుఅవుతుంది.

కామన్వెల్తులో భారతీయులకు ఇప్పుడున్న హక్కులన్నీ ఉంటవి.

ఈ ఒడంబడికను ఏకామన్వెల్తురాజ్యం గానిశాసనంద్వారా బలపరచనవసరంలేదు

ఇండియా రిపబ్లికుగానే రాజప్రతినిధ గాగవర్నరుజనరలుపదవిఅంతమౌతుంది.

కామన్వెల్తు ప్రధానపట్టణాలలో ప్రస్తుతం ఇండియాతరఫున హైకమిషనర్లుగా ఉంటున్న వారిభావిహోదాలు ఇంకా నిర్ణయించబడలేదు.

ఈ ఒడంబడికకు కామన్వెల్తు ప్రభుత్వాలూ, బ్రిటిషు కాబినెటువారూకూడా ఆమోదించారట.

దీనిని బ్రిటిషు పార్లమెంటుచేత ఆమోదింపజేయడానికి బ్రిటిషుప్రభుత్వం త్వరలో ప్రయత్నిస్తుందట. అన్ని కామన్వెల్తు రాజ్యాలవారు తమతమ పార్లమెంటుల ఆమోదాన్ని ఈవిధంగానే సంపాదిస్తారట.

### ఢిల్లీవర్గాల హర్షం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 27: ఇండియా కొద్దినెలలలో స్వీకరించనున్న రిపబ్లికన్ ప్రతిపత్తికి భంగంకలగని పద్ధతిలో కామన్వెల్తుతో సహకరించటానికి అభ్యంతరం లేదని భారత నాయకులు, కాంగ్రెస్ ఇచ్చిన ఆమోదానికి నిన్నరాత్రి కామన్వెల్తు ప్రధానులు చేసుకున్న ఒడంబడిక సక్రమరూపాన్ని ఇచ్చినదని ఢిల్లీ రాజకీయవర్గాలవారు భావిస్తున్నారు. ఈ ఒడంబడిక భారత రాజ్యాంగంలో చేర్చబడదనీ, భారతదేశానికి అధిష్ఠాన సభయైన రాజ్యాంగపరిషత్తు ఒడంబడికను ధృవపరచవలసి ఉంటుందనీ తెలుస్తున్నది. రాజ్యాంగపరిషత్తు దానిని ఎట్టికష్టమూ లేకుండా ఆమోదించునని భావించబడుతున్నది.

### లండన్‌వర్గాల భావం

లండన్, ఏప్రిల్ 27: రిపబ్లిక్‌గా మారిన తరువాతకూడా కామన్వెల్తులో ఉండటానికే ఇండియా నిశ్చయించటం కామన్వెల్తు వ్యవహారాల్లోనే కాక ప్రపంచ వ్యవహారాలన్నిటిలోనూ విశేష ప్రాధాన్యత వహిస్తుందని ఇచ్చటి రాజకీయవర్గాలు అభిప్రాయపడుతున్నారు. ఈ చరిత్రాత్మక నిర్ణయంవల్ల భారతదేశం గొప్ప స్వతంత్ర దేశంగా స్థిరపడటమే కాక, ప్రపంచ బలాబలాలలో కామన్వెల్తు దేశాలతోనే సన్నిహిత సంబంధాలు కలిగి తన బాధ్యతల నన్నిటినీ పూర్తిగా నిర్వహించటానికి ఇండియా అంగీకరించటం జరిగినదని వారు వ్యాఖ్యానిస్తున్నారు.

భారత దేశం ఈ విధంగా నిర్ణయించటం వల్ల సైనిక దృష్టిలోగానీ, రాజకీయ సిద్ధాంతాలదృష్టిలో గానీ ఏర్పడిన ముఠాలలో చేరవలెనన్న అభిప్రాయాన్ని తోసిపుచ్చినట్లు స్పష్టపరచినదని పండిత నెహ్రూ ఉద్ఘాటించినట్లు తెలుస్తున్నది.

### ఆగ్నేయాసియా సమస్యలకు పరిష్కార మార్గం

ఇండోనీషియా పరిస్థితులను చర్చించటానికై ఈ ఏడాది మొదట్లో ఆగ్నేయాసియా రాజ్యాల సమావేశాన్ని ఏర్పరచటంలో ఇండియా తాను ఆసియా రాజకీయాల్లో వహించనున్న పాత్రను స్పష్టపరచినది. కామన్వెల్తు దేశాలలో కలిసి 'శాంతి, స్వాతంత్ర్యం, అభ్యుదయాల' కొరకు ఇండియా పాటుపడుతుందని నేడు చేయబడిన ప్రకటన ఆగ్నేయాసియాలో ఉన్న సమస్యలను పరిష్కరించటానికి తనకుగల అవకాశాలను ఇండియా బలపరచుకున్నట్లు సూచిస్తున్నదని ఇక్కడ భావిస్తున్నారు. చైనా కమ్యూనిస్టులు యాంగ్‌సీని దాటి విజృంభించిన ఈ సమయంలో, మొత్తం చైనా అంతా కమ్యూనిస్టులకిందికి పోయి దాని చుట్టుపక్కల దేశాలన్నిటిలోనూ దానిఫలితాలు కనపడపోతున్న ఈసమయంలో ఈ కామన్వెల్తు ప్రధానుల నిర్ణయానికి అనేక విధాల ప్రాధాన్యత ఉన్నదని ఇక్కడ విశ్వసించబడుతున్నది.

ఈ ఒడంబడికవలన కామన్వెల్తు ఉన్నతస్థితిని పొందినదని ఇక్కడ భావించబడుతున్నది.

### వాణిజ్యవర్గాల సంతృప్తి

కామన్వెల్తుతో ఇండియా భవిష్యత్సంబంధాలగురించి నేడు చేయబడిన ప్రకటనవల్ల ఇక్కడి వాణిజ్య వర్గాలకు ఎంతో బరువును దింపినట్లనిపించింది. ప్రస్తుతం కామన్వెల్తు దేశాలకు అన్యోన్యంగా ఉన్న ప్రత్యేక వాణిజ్య సౌకర్యాలు (ఇంపీరియల్ ప్రిఫరెన్స్) రిపబ్లికన్ ఇండియాలో కూడా ఉండగలవని వారు దృఢంగా విశ్వసిస్తున్నారు. ఈ అభిప్రాయాన్ని అధికారవర్గాలు బలపరుస్తున్నారు.

### సమితివర్గాల సంతృప్తి

లేక్ సక్సెస్, ఏప్రిల్ 27: భారత రిపబ్లిక్ కామన్వెల్తులోనే ఉండవలెనని కామన్వెల్తు ప్రధానులు చేసుకున్న ఒడంబడిక ఐక్యరాజ్యసమితి వర్గాల్లో సంతృప్తిని కలిగించింది. ముఖ్యంగా అరబ్ దేశాలు ఈజిప్టు రాయబారి ఇండియాను అభినందించాడు.

ఇండోనేసియా ప్రతినిధి పాలర్ ఈ విధంగా అన్నాడు. "ఇండియా, ఇండోనేసియాల స్వాతంత్ర్య పోరాటాలు ఒకే విధంగా ఉన్నప్పటికీ బ్రిటిష్‌వారు దానిని సవ్యంగా పరిష్కరించబంవల్ల ఇండియా తనకుతానే కామన్వెల్తులో ఉండగోరుతున్నది. వచ్చినా రుయద్ధం విషయంలో ఇతర మార్గం పనికి రాదంటున్నారు."

### న్యూ జీలెండ్ ప్రధాని వ్యాఖ్య

లండన్, ఏప్రిల్ 27: న్యూజీలెండ్ ప్రధాని ఫ్రేజర్ కామన్వెల్తు ప్రధానుల ఒడంబడికపై ఈ విధంగా వ్యాఖ్యానించాడు. "ఇండియాను కామన్వెల్తులో నిలిపిఉంచటానికి ఒక మార్గం దొరకటం చాలా శ్లాఘనీయమైన విషయం. న్యూజిలండ్‌కు సంబంధించినంతవరకూ బ్రిటిష్ సింహాసనంపట్ల ఆదేశానికి గల విధేయతలో ఏ మార్పు లేదు. సమావేశంలో పాల్గొన్న 8 దేశాల ప్రతినిధులు కామన్వెల్తులోనే ఉండి పరస్పర సహాయం చేసుకొనుటకు ఆశాలామనప్రకటించారు.

ఆస్ట్రేలియా ప్రధాని చిఫ్లే నేడు బ్రిటిష్ విదేశాంగమంత్రి బెవిన్‌ను కలుసుకొని సంప్రదింపులు జరిపెను. వీరు దూరప్రాచ్య పరిస్థితులపై సంప్రదింపులు జరిపినట్లు తెలుస్తున్నది. వీరుమధ్య ప్రాచ్యంలోని రహదారి మార్గాలను గురించి చర్చించినట్లు తెలుస్తున్నది. ఈ మార్గాలు ఆస్ట్రేలియారక్షణకు, వ్యాపారానికి అత్యవసరం.

### క్రిప్సుతో ప్రధాని నెహ్రూ సమాలోచన

ప్రధాని పండిత నెహ్రూ దాదాపు 10 రోజుల్లో ఇండియాకు వెడతాడు. ఆయన నిన్నరాత్రి క్లారిడ్జెస్ హోటల్‌లో బ్రిటిష్ ఖజానామంత్రి సర్ స్టాఫర్ క్రిప్సునుకలుసుకున్నాడు. ఆయననేడు ఐర్ ప్రభుత్వాహ్వానంమీద ఐర్ రాజధాని డబ్లిన్‌కు విమానంలోవెళ్లి ప్రెసిడెంట్ సీన్ ఓకెల్లీ, ప్రధాని జాన్ కాస్టెల్లో, మొదలైనవాళ్లను కలుసుకుంటున్నాడు.

పండిత నెహ్రూ శుక్రవారంనాడు ఐరిష్ జాతీయుడూ, విఖ్యాత బ్రిటిష్ నాటక రచయితా అయిన బెర్నార్డ్‌షాను కలుసుకుంటాడు. ఈ వారాంతంలో కూడా ఆయన హాంప్‌షైర్‌లోని మౌంట్‌బాటన్ల జమీందారికి వెడతాడు. సోమవారం నాడు బ్రిటిష్ విదేశాంగ మంత్రి బెవిన్‌ను కలుసుకుంటాడు. మంగళవారం నాడు స్విట్జర్లండ్‌కు బయలుదేరే ముందు జార్జి రాజును సందర్శిస్తాడు స్విట్జర్లండ్‌లో ఆయన కొద్ది రోజులు గడుపుతాడు.

పాకిస్తాన్ ప్రధాని లియాకత్ అలీ ఖాన్ కూడా ఐర్‌కు వెడతాడు. సింహళ ప్రధాని సేనానాయకే శుక్రవారం నాడు ఐర్‌కు వెళ్లి వీలైనంత వెంటనే సింహళానికి వెళ్లిపోతాడు.

వాషింగ్టన్, ఏప్రిల్ 27: 'ప్రతీప సంఘాలని' ప్రభుత్వం. తయారుచేసిన దాదాపు 100 పేర్లజాబితాను అమెరికా అటార్నీ జనరల్ టామ్‌క్లార్కు, 38 పేర్లను చేర్చెను. ఇందులో 23 కమ్యూనిస్టు సంఘాలనీ, 7 ఫాసిస్టు సంఘాలనీ, అతను పేర్కొనెను.

## మదరాసు ధరలు

మదరాసు, ఏప్రిల్ 28:

వేరుసెనగ: (531 పౌ 1-కి ఎన్న కోస్తాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు(కొత్తది) రు. 165-8-0 నుండి 167-0-0

వేరుసెనగనూనె ఎక్సుపెల్లర్ (గ్యారంటీ) (సేల్సుటాక్సుతో సహా) రు. 340-0-0

ఆముదం బజారు డెలివరీ ఎక్సుపెల్లర్ ఇంగ్లీషుకాండి 500 పౌనులు గలది

| | |
|---|---|
| మొదటి రకం | రు. 350-0-0 |
| రెండవ రకం | రు. 342, 344 |

కొబ్బరినూనె (37 పౌను గల డబ్బా) ఒకటికి రు. 88-4-0

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎన్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతోసహా రు. 74-10-0 పెట్లా బంగారు తులం 115-0-0 మూస బంగారు 113-12-0 సీమవెండి తులం 100-కి (రెడీ) 182-8-0 వెండి తులం 1 కి 1-14-0.

### పంచదార

"కాన్పూరు" (2 అం॥) రు 90, 92-8-0

అనకాపల్లి" (2 అందరు) స్టాకు లేదు

సీతానగరం(2అం॥) రు. 90-4-0,91-8-0

బూరా (25 పౌ) రు 10-0-.

## న్యూయార్కు దూది

న్యూయార్కు, ఏప్రిల్ 27.

మే 33.12/33.12 జూలై 32.40/32.42 అక్టోబర్ 29.12/29.12 డిశంబరు 28.90/28.90 మార్చి 28.75/నా. మే 28.58/నా. జూలై 27.62/27.62 అక్టోబర్ 25 75/25.75.

| | | |
|---|---|---|
| మిడ్లింగ్ | హాజరు | 33 34 |
| జూలై (గరిష్టధర) | | 32.42 |
| (కనిష్టధర) | | 32 26 |

### మే వాయిదా ధరలు

| | | | |
|---|---|---|---|
| నేటి | ప్రారంభం | వల | 32 26 |
| | నిన్న | | 32.63 |
| ,, | ముగింపు | వల | 32.40 |
| | నిన్న | | 32 58 |

# ఆగ్నేయాసియాలో కమ్యూనిజంను అణచేందుకు ప్రయత్నాలు

## ప్రాచ్యదేశాలలోని అమెరికా ప్రతినిధులు ఢిల్లీ సభలో చర్చించిన వివరాలు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 27: ఆగ్నేయాసియాలోని వివిధ దేశాలలోగల అమెరికా ప్రభుత్వ ప్రతినిధులూ, వాషింగ్టనులోని ప్రభుత్వశాఖల ప్రతినిధులూ దాదాపు 40 మంది చేరి ఇండియాలోని అమెరికను రాయబారి లాయ్ హెండర్సన్ అధ్యక్షతకింద న్యూఢిల్లీలో జరిపిన సమావేశం నిశ్శబ్దంగా, నిరాడంబరంగా జరిగిపోయింది. ఆగ్నేయాసియాలోని అమెరికను విదేశాంగశాఖలు చేసేపనిని గురించి సమాలోచనలు జరుగుతవని మాత్రమే ప్రకటించబడింది.

అయితే ఈ సమావేశంలో ఆగ్నేయాసియా రాజ్యాలన్నిటిలోనూ గల రాజకీయ, ఆర్థిక పరిస్థితులను గురించి చర్చలు జరిగినట్లు నాకు తెలిసింది. ఈ ప్రాంతంలో చెలరేగిన కమ్యూనిస్టు విజృంభణను గురించీ, దానిని అణచడానికి వివిధ ప్రభుత్వాలు తీసుకొంటున్న చర్యల సమగ్రతను గురించీ చర్చలుజరిగి ఉంటాయనడానికెట్టి సందేహము లేదు. న్యూఢిల్లీలో జరిగిన ఇండోనీషియా సమావేశంలో విదితమైన ఆసియా ప్రాంతీయ సమైక్యతయొక్క లోతు పాతులను గురించి చర్చలుజరిగినట్లు భావించబడుతున్నది.

ఈసమావేశం న్యూఢిల్లీలో జరగడంలో గల అంతరార్థం గమనించదగినది. ఆసియా ప్రాంతమంతటికీ వర్తించే ఈసమావేశాన్ని ఇక్కడ జరపడంలో అమెరికను ప్రభుత్వం వారు, ఆసియా వ్యవహారాలలో సేకాక ప్రపంచ వ్యవహారాలలో సయితం ఇండియా నిర్వహించగల ప్రముఖ పాత్రను స్మరించారని మనం భావించవచ్చును.

## అల్లాబాద్ న్యాయమూర్తి బర్తరఫ్

న్యూఢిల్లీ, ఏప్రిల్ 27: ఇటీవల ఫెడరల్ కోర్టువారు జరిపిన విచారణ ఫలితమును పురస్కరించుకొని భారతప్రభుత్వం అల్లాబాద్ హైకోర్టు న్యాయమూర్తి శివప్రసాద్ సిన్హాను పదవినుండి తొలగిస్తూ ఉత్తరువులు చేసినట్లు తెలుస్తున్నది.

## మధ్య భారత్ బందిపోటు దారుని బెదిరింపు

గ్వాలియర్, ఏప్రిల్ 27: మధ్య భారత్‌లో పేరు మోగిన బందిపోటుదారు మోహన్‌సింగ్ గ్వాలియర్ ప్రజలందర్నీ హెచ్చరిస్తూ ఏప్రిల్ 25-30 తేదీల మధ్య సరఫా బజారులోని నగల దుకాణాలన్నింటినీ మొత్తంగా దోచివేస్తానని ఒక హెచ్చరిక చేశాడు. దంతో వర్తకులు హడలెత్తి తమ సొమ్మునంతా సురక్షిత ప్రాంతాలకు చేరవేశారు. ఆ బజార్లో పోలీసు బందోబస్తు ఏర్పాటు చేశారు.

## కార్పొరేషన్

మదరాసు. కార్పొరేషన్ కౌన్సిలు మంగళవారం మేయరు రామస్వామి నాయుడుగారి అధ్యక్షతను జరిగినపుడు, విద్యాసంస్థల భవనములు మున్నగు ఖర్చు లక్ష రూ. 12,44,000 ప్రభుత్వంవారిని ఋణ మడుగుటకు తీర్మానించబడెను.

### గుర్రపుపందెముల పన్ను

గిండీ గుర్రపుపందెముల పన్నుకలన కార్పొరేషనువారికి సాలీనా 1½ లక్షలు రాబడి వస్తున్నందున, అది పడలుపంటే ఆదాయవ్యయములు సరిచేసుకొనుట కష్టం గనుక, గుర్రపుపందెములు రద్దుచేసినచో ప్రభుత్వంవారిని నష్టపరిహారం కోరవలెనని కార్పొరేషను కౌన్సిలుకి కమీషనరుగారు సూచించిరి.

## బస్సు బోల్తాడిపడి ఒకస్త్రీ మరణం

బళ్ళారి, ఏప్రిల్ 26. ఇక్కడికి 10 మైళ్ళదూరాన ఒక బస్సు బోల్తాపడినందున ఒకస్త్రీ మరణించుట, 12 మంది గాయపడుట జరిగెను. ముగ్గురు తీవ్రముగ గాయపడిరి. గాయపడినవారిని చికిత్సకై స్థానిక ఆస్పత్రికి తీసుకువచ్చిరి. పోలీసు దర్యాప్తు జరుగుచున్నది.

ఆంధ్రరాష్ట్ర యువజన కాంగ్రెసు కార్యవర్గ సమావేశం మే 1 వ తేదీ మధ్యాహ్నం 2-గం. కు విజయవాడలో ఆంధ్రరత్నభవనమందు జరుగును.

మదరాసులో బహిరంగసభలు పోలీసు కమీషనరు అనుమతిలేనిది జరుగరాదని నిషేధాజ్ఞ 30-6-49 తేదీవరకుకమీషనరు గారు పొడిగించిరి.

## అబ్దుల్లా రాజు హత్యాభియోగం

### నిందితులలో నలుగురికి ఉరిశిక్ష

అమాన్, ఏప్రిల్ 2?: అబ్దుల్లా రాజును హత్యచేయటానికి కుట్రపన్నినారనే నేరంపై ట్రాన్స్‌జోర్డాన్ క్రిమినల్ కోర్టువారు నేడు ముగ్గురు పాలస్తీనా అరబ్బులకు, ఒక ట్రాన్స్‌జోర్డాన్ నివాసికి ఉరిశిక్ష విధించిరి. గత నెలలో వీరు ట్రాన్స్ జోర్డాన్ ముఖ్యపట్నం, అమ్మాన్, ఎరికోపట్టణం రోడ్డుమీద సొరంగమార్గం మందుగుండు గనులుంచి, అబ్దుల్లారాజు ఆరోడ్డుమీద వెళ్లునప్పుడు హత్య చేయుటకు ప్రయత్నించినారని ఆరోపించబడింది. ఈ సందర్భంలోనే యిద్దరు సిరియనులు, యిద్దరు పాలస్తీనా అరబ్బులకు, యావజ్జీవ కారాగార వాస శిక్ష విధించ బడెను. వీరు కోర్టుకు హాజరు కాలేదు. ఈ కుట్రసందర్భంలో మరి 6 గురు పాలస్తీనా అరబ్బులపై పెట్టబడిన కేసులు కొట్టివేయ బడినవి. యావజ్జీవ కారాగార శిక్ష విధింపబడిన యిద్దరు సిరియనులలోను కర్నల్ మహమ్మద్ మిండి అనునతడు సాయుధ పోలీసుబలము ఇన్‌స్పెక్టరు జనరల్‌గా పనిచేయుచున్నాడట. రెండవవాడుకూడ సిరియా పోలీసు బలము ఉన్నతోద్యోగములోనున్నాడట.

అబ్దుల్లారాజును హత్య చేయవలెనను తలంపుతోనే అమ్మాన్ వెళ్లినానని నిందితుడు అంగీకరించెను. తీర్పు విన్న తరువాత క్షమించవలసిందిగా ఆ నిందితుడు అబ్దుల్లానుకోరెను. శిక్షలు విధింపబడినవారు ఒక పక్షంలోగా అప్పీలు చేసుకోవచ్చును.

## సిరియా-ట్రాన్సుజోర్డన్ సంఘర్షణ

డెమాస్కస్, ఏప్రిల్ 26: సిరియా నూతన ప్రధాని కలనల్ హస్ని ఎల్ జియామ్ సిరియా-ట్రాన్సుజోర్డాన్ సరిహద్దును మూసివేయుచూ ఈ రోజు ఉత్తరువులు జారీ చేసినాడు. దురాక్రమణలు ప్రారంభ మగుచుండుటచే ఇట్టి చర్య తీసుకొనవలసివచ్చినదని ప్రకటింపబడినది.

సైన్యమును సమీకరించవలసినదిగానూ, "ఎట్టి విపత్కర దైనను ప్రతిఘటింపవలసినది"గానూ, ప్రధాని ఉత్తరువులు జారీ చేసినాడు.

మధ్యప్రాచ్యములో, టర్కీ తరువాత రెండవ సైనికబలముగా సిరియాను తయారుచేయుట ప్రధాని ఉద్దేశ మట.

"ఇరాక్, ట్రాన్సుజోర్డన్, సిరియాలను కలిపి "విశాలసిరియా"ను స్థాపించాలనే ఈ రకం కార్యక్రమాన్ని ఏదైనా సిరియా బలవత్తరంగా ప్రతిఘటించి తీరుతుంది.

"ట్రాన్సుజోర్డన్ రాజు సాగించ పూనుకుంటున్న ఈ పథకానికి, కాల్తే అబ్బయ్యని పరిపాలనలోనే, సిరియాప్రభుత్వ మేనాడో ధిక్కారం చెప్పింది" అని ప్రధాని ప్రకటించాడు.

## సిరియాకొత్త ప్రభుత్వం

వాషింగ్టన్, ఏప్రిల్ 27: కలనల్ హస్ని జియామ్ సిరియాలో ఏర్పరచిన కొత్త ప్రభుత్వాన్ని అమెరికా, బ్రిటను నేడు గుర్తించినవి.

## భూపాల్ నవాబు ఆరోగ్యం

భూపాల్, ఏప్రిల్ 27: భూపాల్ నవాబ్ అస్వస్థతకారణంగా వి. పి. మీనన్ భూపాల్ రాక తిరిగి వాయిదాపడవచ్చునని తెలుస్తున్నది. భూపాల్ నవాబును చికిత్సనిమిత్తం శుక్రవారం బొంబాయి తీసుకువెళ్తారని ఆయనస్థితి నిన్నటికంటే నేడుకొంచెం నయంగా ఉందని తెలుస్తున్నది.

## వరంగల్లు జిల్లాలో కాంగ్రెసు కార్యకలాపాలు

హైదరాబాదు, ఏప్రిల్ 27: నల్గొండ, వరంగల్లుజిల్లాలలో కమ్యూనిస్టు ప్రమాదం హెచ్చుగా ఉండటంచేత అక్కడ కాంగ్రెసు కార్యకలాపాలు కట్టిపెట్టవలసినదిగా కొంతకాలంకిందట హైదరాబాదు మిలిటరీ ప్రభుత్వం ఉత్తరువు చేసింది.

అధికారులవద్ద ముందుగా అనుమతి తీసుకొని, నెలరోజులుగా నిలచిపోయిన కార్యకలాపాలు తిరిగి ఆరంభించవలసిందని వరంగల్లుజిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు తాలూకా కాంగ్రెసులకు తాఖీదు పంపాడట.

## ఇద్దరు కాంగ్రెసువాదుల అరెస్టు

హైదరాబాదు, ఏప్రిలు 27: విద్రోహకచర్యలు చేసినందుకు ప్రజారక్షణ చట్టంక్రింద మెదకులో ఇద్దరు కాంగ్రెసు కార్యకర్తలు అరెస్టు చేయబడ్డారు. వీరిలో ఒకరు ఒక తాలూకా కాంగ్రెసు అధ్యక్షుడు.

మెదకు జిల్లాలో 205 మంది కమ్యూనిస్టులు అరెస్టుచేయబడ్డారు, ఇప్పుడక్కడ కమ్యూనిస్టు ఐన్యమొస్త.

# చైనా ప్రభుత్వ యుద్ధ తంత్రం

## షాంగైనగరరక్షణకు చాంగ్‌కైషేక్ వ్యూహం

షాంఘై, ఏప్రిల్ 27: మూడు నెలలుగా చైనా రాజకీయములలో జోక్యం నిరమించుకొని ఏకాంతవాసం గడుపుతున్న జనరల్ లిస్సిమో చాంగ్‌కైషేక్, కమ్యూనిస్టు నియంతృత్వాన్ని నిరోధించడానికి చైనా ప్రజలందరు నడుముకట్టి కలిసికట్టుగా నిలువబడవలెనని రేడియో ద్వారా నేడు విజ్ఞప్తిచేసి, చైనా రాజకీయ రంగంలో తిలవని తలంపుగా నేడు పునఃప్రవేశం చేసెను. చాంగ్‌కైషేక్ ఈ రేడియో ప్రసంగమును తన జన్మరాష్ట్రమైన ఛేకియాంగ్ నుండి కావించెను. రేడియో ప్రసంగం అయిన వెంటనే చాంగ్‌కైషేక్ నేరుగా షాంఘైకు విమానంలో బయలుదేరి వెళ్లెననీ, కమ్యూనిస్టు సేనావాహినులచే ఇంచుమించు అన్నివైపులా చుట్టు ముట్టబడిన షాంఘై నగరం రక్షణకు వ్యూహం ఆలోచించడానికి చాంగ్‌కైషేక్ తక్కిన ప్రభుత్వోద్యోగులతో సమావేశం జరుపుననీ ఒక అనిర్ధారితమైన వార్త వచ్చింది. జనరలిస్సిమో సంగ్రామ రంగంలో ఉన్న ప్రధాన నగరానికి తన జన్మస్థానం విడచివచ్చాడన్న వార్త ఇంకా ధ్రువపడలేదు. 25 ఏళ్లపాటు చైనాకు అద్వితీయుడైన నాయకుడుగా పనిచేసిన గడబిడ జనవరిలో అధికార పీఠంనుండి అవరోహించిన జనరలిస్సిమో చాంగ్‌కైషేక్, తిరిగి రాజకీయాలలో ప్రత్యక్షముగా అడుగుపెట్ట నుద్యమించుచున్నాడని రాజకీయ పరిశీలకులు ఈ బ్రాడ్‌కాస్టు ప్రసంగాన్ని బట్టి అర్థం తీస్తున్నారు. (ఈ ప్రసంగం 5 వ పేజీలో ప్రకటింపబడింది.)

షాంఘై పరిసరములలో అలముకొన్న అశాంతిని స్థితి నేడు కూడా చెక్కుచెదరలేదు. కాని నగరమునకు పడమరగా 60 మైళ్ల దూరంలో నూచౌవద్ద ప్రభుత్వ సైన్యములు ఎత్తరచ్చుచున్న ఒక కమ్యూనిస్టు సైనిక శ్రేణిని తీవ్ర సంగ్రామానంతరం నిలువరించినవని తెలుస్తున్నది.

కమ్యూనిస్టు సైన్యముల తాకిడిని ఏ లైనంత వరకు నిరోధిస్తూ మరీ శక్తికి మించుకుండని తోచగానే దక్షిణ కోస్తాలోని నింగ్‌పో, ఫూచౌ, అమాయ్, కాంటాన్‌వంటి ప్రధాన స్థావరాలకు నడుదరిగి పోవడమే, ప్రస్తుతానికి జాతీయ సైన్యములు అవలంబించవలచిన యుద్ధతంత్రమని రాజకీయ పరిశీలకులు అభిప్రాయపడుతున్నారు. ఈ దక్షిణ కోస్తా స్థావరములకు ఉపసంహరించుకున్న ... విమానదళములు అండకూడా సైన్యములకు లభిస్తుంది. పెకింగ్‌లో ప్రభుత్వం తరఫున కమ్యూనిస్టులతో సంధి సంప్రతింపులు జరుపుతున్న ... పలువురికి కమ్యూనిస్టులు ఉన్నతమైన పదవులను వాగ్దానం చేశారు. ఈ విధంగా ప్రలోభపెట్టబడినవారిలో పశ్చిమోత్తర రాష్ట్ర గవర్నరు అయిన జనరల్ చాంగ్‌చు ... కమ్యూనిస్టుల ఈ ప్రలోభ ప్రయత్నములకు నాయకులైన ... ప్రాంతము జనులందరి ఉన్న సింకియాంగ్, కన్సు, నింగ్‌షియా, చింగై అను ఈ నాలుగు పెద్ద రాష్ట్రములు ఇక్కడ ... చైనా ... చేసుంటా

కమ్యూనిస్టుల చేజిక్కితేవి. ప్రపంచంలోని పెద్ద వాణిజ్య నగరములలో ఒకటిగా పేర్కొనదగిన షాంఘై పట్టణ రక్షణయే చైనా జాతీయపక్ష సైన్యములకు తక్షణ సమస్య.

షాంఘైకు 50 మైళ్ల దూరంలో 2000 మంది కమ్యూనిస్టు సైనికులు యాంగ్సీని దాటి నగరంమీదికి ఎత్తికవస్తున్నారను. ప్రభుత్వ సైన్యములు ఈ సైనిక శ్రేణిని జయప్రదంగా ప్రతిఘటించినవనీ తమ యుద్ధస్థితిగురించి తాజాగా ఇంకేమీ తెలియలేదు. షాంఘైకు 60 మైళ్ల దూరంలో సూఛౌను రక్షిస్తున్న ప్రభుత్వ సైన్యములు కమ్యూనిస్టు ఒత్తిడికి కొంచెం వెనక్కు తగ్గినవి. షాంఘైలోని పరదేశీయులను సంరక్షించడానికి చైనాప్రభుత్వ సైన్యములు శాయశక్తులా తోడ్పడునని షాంఘై సైనిక కార్యాలయం ప్రకటించింది. షాంఘైలో 4000 మంది బ్రిటిషువారు ఉన్నారు. "లండన్" "బ్లాక్‌స్వాన్" అనే నౌకలు కమ్యూనిస్టు సైన్యములతో పోరాటం చేసుకోవడానికి ముందుగానే షాంఘైనుండి 10 మైళ్లు ... తప్పుకొన్నవి. ... ... అనే నౌకలు ... షాంఘైనుండిగా బయలుదేరినవి. ... విమానములు ... నగరంచుట్టూ పరిభ్రమిస్తూ వెళిపోతున్నవి.

## ఆటం యుద్ధ రహస్యసాధకం

లండను, ఏప్రిలు 25: లండనువద్ద గ్రీన్‌విచ్‌లోని నౌకాయుద్ధశాస్త్ర కళాశాలయందు ఆటం యుద్ధవిధాన మెట్లుండెగలదో బ్రిటిష్ రాజ్యాల కూటంలోని ఉన్నత సైనికాధికారులకును అమెరికను ఉన్నత సైనికాధికారులకును ఉపదేశింపబడుచున్నది. ఈ ఆటంయుద్ధతంత్రమునకు సంబంధించిన పరమరహస్యములు నౌకాయుద్ధమునకు సంబంధించిన సాధకములు అంతరంగికముగా యీ ఉన్నత సైనికాధికారులకు బోధ చేయబడుచున్నది. ఇతరులెవ్వరును లోపలికిరాకుండ తలుపులు బంధింపబడిన పిమ్మట యీ ఆటంయుద్ధ విధానమును గూర్చి ఉపన్యాసము ... సంగబడుచుండును. ఈ ఉపన్యాసములు నివర్శనములతోసహా అయిదు దినములు బోధింపబడును. ఎవ్వరూ లోపలికిరాకుండా, బయట సైనికులపహారా బందోబస్తులు చేయబడెను. యుద్ధకాలంలోకూడా ఇంతటి పహరాబందోబస్తుఎప్పుడును చేయబడలేదు. ఇచట జరిగెడి రహస్య ప్రసంగములకు అత్యున్నత సైనికాధికారులు రమారమి 400 మంది విచ్చేసిరి. శాస్త్రవేత్తలు, సమావేశమై యీ ప్రసంగములను వినుచున్నారు. బ్రిటిష్ కామన్వెల్తు రాజ్యముల రక్షణకు ఎటువంటి యుద్ధతంత్రము అవసరమో ఏ ఆయుధసాధనములను ప్రయోగించవలెనో ఉత్తరోత్తర ఏ సముద్రమార్గమును ఉపయోగించి ఏకీతిగా యుద్ధ నావలు సంచరించవలెనో ఆయా పథకములు మార్గోపాయములు, ఈ సంబంధమైన నూతనవిధాన సమర తంత్రమును గూర్చి అతిరహస్యముగా చర్చింపబడునట.

## సంస్థానాల చేరికవల్ల రాష్ట్రాల ఖర్చు హెచ్చింపు

(ఆంధ్ర పత్రిక విలేఖరి)

న్యూఢిల్లీ, ఏప్రిల్ 27: ఇండియా ప్రభుత్వంనుండి ఇప్పుడు పుచ్చుకొంటూ ఉన్న గ్రాంటుకు రెండింతలకు పైగా ఇవ్వమని ఒరిస్సా ప్రభుత్వం అడిగినట్లు నాకు తెలియవచ్చింది. బొంబాయికూడా ఇదేవిధంగా హెచ్చుగ్రాంటు కోరుతుందని తెలుస్తున్నది. సంస్థానాలు రాష్ట్రాలలో చేరిపోవడంవల్ల, సంస్థానాల పరిపాలన రాష్ట్ర పరిపాలనతో సరిసమానంగా పెంచడానికి ఈ రాష్ట్రాలకు శక్తి చాలకుండా ఉన్నది.

సంస్థాన రాబడుల నూ రాష్ట్ర రాబడులతో కలపడం గురించి కృష్ణమాచారియరు నివేదిక వెలువడేవరకూ ఎట్టిభారాన్ని పైనవేసుకోవద్దని ఆరువారాలక్రితం ఇండియా ప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాలకు హెచ్చరికచేసి తన నుదిన్నయాన్ని నిలిపి ఉంచింది.

మే నెల 8, 9 తేదీలలో ఇక్కడజరిగే గవర్నరుల సమావేశంలో ఆసాములోని మణిపూరువంటి సరిహద్దుసంస్థానాల పరిపాలనాసమస్య గురించి చర్చ జరుగుతుందని కూడా నేను తెలుసుకొన్నాను.

స్వయంగా పరిస్థితిని చూడడానికీ, ప్రత్యేకించి కమ్యూనిస్టుల రహస్య ప్రవేశం గురించి తెలుసుకోవడానికీ ఇండియా ప్రభుత్వంవారు మణిపూరుపంపిన చాటర్జీ న్యూఢిల్లీ తిరిగివచ్చాడు. ఈయన త్వరలోనే తననివేదికను ప్రభుత్వానికి అందచేస్తాడట. దివానుఅమరనాథును ఇండియా ప్రభుత్వమువారు మణిపూరు ప్రధాన మంత్రిగా నియమించారు.

## రష్యాకు అమెరికా ప్రశ్న

న్యూయార్కు, ఏప్రిల్ 27: ఫిన్లండ్ ... ప్పుడు ఎవరనుల పై ఎత్తి వేయడం జరుగుతుం నేను అమెరికా రష్యాను ప్రశ్నించింది. ఇందుకు సంబంధించిన అమెరికా అధికార పత్రమును ఫిలిప్ జెసప్ ఐక్యరాజ్య సమితి సోవియట్ ప్రతినిధివర్గ కార్యాలయంలో ఉన్న వస్యలీ విదేశాంగ ఉపమంత్రి మాలిక్‌కు అందచేసినట్లు తెలుస్తున్నది.

## తారాసింగ్ ఆరోగ్యం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 27: మాస్టర్ తారాసింగ్‌ను జెయిల్లో సరిగా చూడటం లేదని, ఆకారణంగా ఆయన ఆరోగ్యం చెడిందని ప్రచారమైన వదంతులను ఖండిస్తూ భారతప్రభుత్వం ... ప్రకటన చేసింది. ఈ వదంతులన్నీ నిరాధారములని తారాసింగ్ ఆరోగ్యం తృప్తికరంగానే ఉంటున్నదని ఆ ప్రకటన తెలుపుతున్నది.

## భారత సాయుధ సైనిక దళములు ఇంటర్ సర్వీసెస్ వింగ్

1950 వ సంవత్సరము జనవరిలో, డెహ్రా డూన్ నందు, ప్రారంభమగు సాయుధ సైనికదళముల అకాడమీయొక్క, ఇంటర్ సర్వీసెస్ వింగ్ యందు చేరుటకు ప్రవేశము పరుగాను, వివాహము కాని ఇండియన్ జాతీయుల నుండియు. నేపాల్ లోని గూర్ఖాల నుండియు దరఖాస్తులు కోరబడుచున్నవి. ఈకోర్సుకు 1949 జూన్ 13,14, తేదీలలో జరుగవలసిన ప్రవేశపరీక్ష, యిపుడు 1949 సం॥రము ఆగస్టు, 22, 23 తేదీలలో జరుగును, పూర్తిచేసిన దరఖాస్తుఫారములు ఫెడరల్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ ఆఫీసుకు చేరవలసిన ఆఖరుగడువు 1949 ఏప్రిల్ 2వ తేదీనుంచి మే 28వ తేదీకి విస్తరింప బడినది. దరఖాస్తు ఫారములు, పూర్తివివరములు సెక్రటరీ, ఫెడరల్ పబ్లిక్ సర్వీస్ కమీషన్, పో. బా. 186 కౌన్సిల్ హౌస్, న్యూఢిల్లీనుండిగాని సమీపమున వున్న మిలిటరీ సబ్ ఏరియా హెడ్ క్వార్టర్సు నుండిగాని, రిక్రూటింగ్ ఆఫీసు నుండిగాని, పొందవచ్చును.

వయోపరిమితి: పుట్టినదినము 2-1-1933 కంటె పూర్వముగాని, 1-1-1935 కంటె తరువాతగాని వుండరాదు.

విద్యార్హతలు: మెట్రిక్యులేషనుగాని, దానికి సమానమైన పరీక్షగాని ప్యాసై యుండవలెను. మెట్రిక్యులేషను గాని దానికి సమానమైనగాని పరీక్షకు యిదివరకే హాజరై యున్న లేదా హాజరు కాదలచిన అభ్యర్థులనుండి దరఖాస్తులు తాత్కాలికముగా అంగీకరింపబడును. వారు పరీక్షప్యాసయినట్లు ఫెడరల్ పబ్లిక్ సర్వీస్ కమీషను పరీక్ష ప్రారంభమగు తేదీకి ముందుగానే రుజువుపరచవలసి యున్నది.

సెలెక్షన్: ఫెడరల్ పబ్లిక్ సర్వీస్ కమీషనుయొక్క వ్రాత పరీక్షయందు ఉత్తీర్ణులైన అభ్యర్థులు సర్వీసెస్ సెలెక్షన్ బోర్డుయెదుట హాజరు కావలసియుండును.

ఈ పరీక్ష ఫలితముగా అకడమీ ప్రవేశమునకు తీసుకొనబడు ఖాళీలసంఖ్య దిగువవిధముగా నుండును.

| | | |
|---|---|---|
| నౌక | ... | 25 |
| సైన్యము | ... | 162 |
| వైమానిక దళము | ... | 25 |
| భారత సంస్థానముల దళములు | ... | 25 |
| మొత్తం | | 237 |

Ac-12



## దేశభాషా నిర్ణయం

### ఆంధ్ర ఉర్దూ మహాసభలో ప్రసంగాలూ, తీర్మానాలూ

విశాఖపట్టణం, ఏప్రిల్ 25: దేశభాషగా "ఉర్దూ", ఉండవలెనా, "హిందీ" వుండవలెనా అనే వివాదమును విరమించి, దేశమంతా సులభముగా వ్యవహారములకు నడుపుకొనేందుకు వీలైన భాషను తయారుచేసి, దానిని దేశభాషగా ప్రభుత్వము నిర్ణయించవలెనని, నిన్న, మొన్న ఇచ్చట జరిగిన ఆంధ్ర ఉర్దూ ద్వితీయ సమావేశములో అధ్యక్షుడు ప్రొఫెసర్ కాళీ ప్రకాశ్‌నిగం, తదితర ఉపన్యాసకులూ ఉద్ఘాటించారు.

సమావేశమునకు తెలుగు జిల్లాలనుంచి వెయ్యిమందికిపైగా సభ్యులు హాజరైనారు. పట్టణ కాంగ్రెస్ అధ్యక్షుడు వి. జే. గుప్తాగారు, ప్రారంభోపన్యాసం చేస్తూ ఉర్దూభాష దేశమునకు మహోపకారము చేసిందన్నారు. అధ్యక్షుడు కాళీ ప్రకాశ్ నిగంగారు, ఉర్దూభాష పుట్టుపూర్వోత్తరముల వివరించి, చర్చ చేసిన పిదప ఉత్తర హిందూస్థానములోనూ, సంయుక్త రాష్ట్రములలోనూ ఉర్దూభాషా కోవిదులు హిందువులేననీ, వారి వ్యవహారభాష ఉర్దూ అనియూ, బహుళ సంఖ్యాకులు ఉర్దూభాషనే ఉపయోగిస్తూన్నారనీ, హిందీకీ-ఉర్దూకూ భేదము కలిపి మాత్రమేననీ అన్నారు.

"హిందీ—ఉర్దూ" భాషా చర్చలవల్ల అనవసరమైన కాలయాపన చేయుటకన్న మహాత్మాగాంధీ సలహా ప్రకారం మహమ్మదీయులు నాగరిలిపీ, హిందువులు పరిషియన్ లిపినేర్చుకుని ఒక సామరస్యము కుదుర్చుకొనుట అవసరమన్నారు.

బేగంసయిదా అక్తార్ డి.సుబ్బరామస్వామి, బాబూలాల్ ప్రభృతులు పలువురు అధ్యక్షుని అభిప్రాయములతో ఏకీభవించుచు ప్రసంగించారు.

రెండవరోజున సమావేశానికి బేగం సయిదా అక్తార్ అధ్యక్షతవహించారు. మనప్రభుత్వం ఒకమతమునకూ జాతికీ సంబంధించినది కాదు కనుక అన్ని భాషలకూ ప్రభుత్వము సమానమైన స్థానము కల్పించవలెననీ, మహాత్ముని ఆదేశప్రకారము మహమ్మదీయు లందరూ నడచుకొనవలెననీ అన్నారు. గత సంవత్సరన్నరలో భారతదేశంలో జరిగిన సంఘటనవల్ల ప్రభుత్వములో మహమ్మదీయుల విశ్వాసము బాగా చెల్లడిఅయినది. వారిభవిష్యత్తు మెరుగుపడుతుందనీ అన్నారు.

"హిందుస్థానీ"ని దేశభాషగా చేసి నాగరిలిపిలోనూ, పరిషయన్‌లిపిలోనూ కూడా వ్రాయించే యేర్పాటులు చేయవలెనని తీర్మానించారు.

ఆంధ్రదేశపు మహమ్మదీయులు ప్రాథమికవిద్య మాతృభాషఅయిన ఉర్దూలో అభ్యసించే సదుపాయములు చేయవలెనని విజయవాడ రేడియో కేంద్రమునుంచి ఉర్దూ భాషలోకూడా ప్రసారములు మొదలుపెట్ట వలయుననియూ, మహమ్మదీయ పిల్లలకు తెలుగుభాష అభ్యసించే సదుపాయములు కల్పింపవలయునని, హైస్కూలు తరగతులలో ద్వితీయభాషగా ఉర్దూనుకూడా వుంచవలయునని కోరుచు తీర్మానాలుచేశారు. ఉర్దూకవులు చాలామంది తమరచనలను వినిపించారు. ఈక్రిందివారితో కార్యవర్గము ఏర్పడెను. అధ్యక్షులు: ఎం. వి. నిజామ్, కార్యదర్శి: మహమ్మద్‌గారి ఫిదాయి, కోశాధికారి: యం. వి. వాహబ్. (స్వ. వి)

## విజయవాడలో సైనిక ప్రచారం

విజయవాడ, ఏప్రిల్ 27: భారత వైమానిక శాఖకు చెందిన వింగ్‌కమాండరు సి. బి. అమరేంద్ర, నావికశాఖకు చెందిన ఎస్. పి. ఎన్. నాయర్, సైనికశాఖకు చెందిన జె. ఎన్. పటేలు అనే వారు భారత వైమానిక, నావిక, సైనిక శాఖలలో ఉద్యోగులను చేర్చడానికిగాను ప్రచారం చేస్తూ నిన్న విజయవాడలో బహిరంగసభలో ఉపన్యసించారు.

బహిరంగసభకు అధ్యక్షత వహించిన డా॥ టి. వి. ఎస్. చలపతిరావుగారు మాట్లాడుచు యువకులు సైనికశాఖలలో చేరి దేశస్వాతంత్ర్యాన్ని కాపాడాలన్నారు. అమరేంద్రగారు సైనికశాఖలలో యువకులకుండే అవకాశాలను వివరిస్తూ, ఈ శాఖలలో అర్హులను చేర్చుకోవాలనే తలంపుతో ఇండియా ప్రభుత్వం క్రొత్త ఉద్యోగులను చేర్చుకొంటున్నదన్నారు; సైనిక శాఖలలో చేరినవారి భవిష్యత్తు గొప్పగా ఉంటుందనీ వర్ణించారు. సైనికశాఖలలో చేరినవారి విధులను గురించీ, అవకాశాలను గురించీ నాయరు, పటేలు గార్లు కూడా మాట్లాడారు, గణపతిరావు హెడ్మాస్టరుగారు మాట్లాడుతూ స్వాతంత్ర్యం వచ్చిన నాక సైనికశాఖలలో చేరడం తప్పనిసరి అన్నారు.

సైనికశాఖాధికారులు విజయవాడనుండి విశాఖపట్నం వెళ్ళారు. అక్కడకూడా యిటువంటి ప్రచారమే చేస్తారు.

## "లిపిమారినా ఉర్దూ లోనే విద్యాభ్యాసం"

### సేట్ గోవిందదాసు ప్రసంగం

హైదరాబాదు, ఏప్రిల్ 26: అఖిల భారత హిందీ సాహిత్య సమ్మేళనాధ్యక్షుడు సేట్ గోవిందదాసు ఇక్కడ చేరిన కొద్ది సేపటికి పత్రికా విలేఖరులతో ఈ విధంగా చెప్పారు:

హిందీ భాషను ఎవరూ బలాత్కారంగా అంటగట్టకుండానే వివిధ రాష్ట్రాల వారు అభిమానం కొద్దీ అభ్యసిస్తున్నారు. పండిత్ నెహ్రూ చెప్పినట్లు హిందీలోకి ఇతర భాషలలోనుంచి వచ్చిన సామాన్య పదజాలాన్ని ఆమోదించడానికి ఆక్షేపణ ఏమీ ఉండదు. కాని హిందీ వాదులు భాషను పార్సీమయం చేయడానికి ఒప్పరు. హిందూస్థానీ అనే పేరుతో ఉర్దూ అంటగట్టని పక్షంలో దేశభాషను హిందీ అనవచ్చు, హిందూస్థానీ అనవచ్చు, యు. పి., బీహారులలో ఉన్న కొద్దిమంది ముస్లిములు తప్పిస్తే ఇండియాలోని ముస్లిములందరి మాతృభాషా ఉర్దూ అనడానికి వీలులేదు.

హైదరాబాదులో ఉర్దూ భాషలోనే విద్యావ్యాప్తి జరగడం అంతమైనప్పటికీ ఇక్కడి హిందూస్థానీ పాఠ్యపుస్తకాలు యథార్థానికి దేవనాగర లిపిలో వ్రాసిన ఉర్దూ పుస్తకాలే.

రాజ్యాంగపరిషత్తువారు జాతీయ భాషను నిర్ణయించేవరకూ హిందూస్థానీ భాషలో పాఠ్యపుస్తకాలు తయారుచేయడం అనవసరం. స్కూళ్లలోని విద్యాభ్యాసం ప్రాంతీయ భాషలోనే జరిపి, కాలేజీలలో విద్యాబోధనకు హిందీ ఉపయోగించడమనేది ఆయారాష్ట్రాలకు వదలడం మంచిది. అన్ని భారతీయ భాషలకూ ఒకే పారిభాషిక పదజాలం ప్రవీణులు నిర్ణయిస్తే బాగుంటుంది.

హైదరాబాదులో మిలిటరీ ప్రభుత్వం సాధ్యమైనంత త్వరలో అంతంకావాలి. హైదరాబాదు సంస్థాన కాంగ్రెసులో తనకు విశ్వాసంలేదని సర్దారు పటేలు చెప్పలేదు. రాష్ట్రప్రభుత్వాలు కోరితేనే తప్ప కేంద్రప్రభుత్వంవారు తమ అధికారులను రాష్ట్రాలకు ఇవ్వరు.

హైదరాబాదు మాట అటుంచి దేశమంతటా కాంగ్రెసువారు పదవుల వెనక బడడం చూస్తే, కాంగ్రెసువారు పదవి స్వీకరించమని ప్రమాణం చెయ్యడం ఉచితంగా తోస్తుంది. భారతదేశం ఐక్యతాబలాలు సాధించిన అనంతరం భాషా రాష్ట్రాలు ఏర్పడడం వాంఛనీయం. స్వ. వి.

## హబీబ్ మహమ్మద్ నిరశన వ్రతం నోటీసు

హైదరాబాద్, ఏప్రిల్ 27: వరంగల్లు జైలులో ప్రస్తుతం నిర్బంధంలోనున్న వరంగల్లు మాజీ రెవెన్యూ కమిషనరు హబీబ్ మహమ్మద్, రజాకర్ చర్యలు జరిపినారనే అనుమానంమీద ముస్లింలను నిర్బంధంలో ఉంచుతున్నందుకు నిరసనగా రేపటినుండి అనగా 28 వ తేదీనుండి ఆమరణ నిరశనవ్రతం ప్రారంభించెదనని జైలు అధికారులకు నోటీసు యిచ్చినాడని విశ్వసనీయంగా తెలియుచున్నది. పోలీసుచర్యకు ముందు రజాకర్లు దురాగతాలు జరుపటానికి ప్రోత్సాహ మిచ్చినాడని హబీబ్ మహమ్మద్ అరెస్టు చేయబడెను. తర్వాత యితడు స్థానిక మేజిస్ట్రేటు ఉత్తరువు ప్రకారం జామీను మీద విడుదల చేయబడి, ప్రజారక్షణ చట్టంకింద తిరిగి అరెస్టుచేయబడి నిర్బంధంలో ఉంచబడెను.

## నల్గొండజిల్లాకమ్యూనిస్టులు

హైదరాబాదు, ఏప్రిలు 27: కమ్యూనిస్టులనే అనుమానంతో నల్గొండ జైళ్లలో నిర్బంధించబడిన సుమారు 300 మంది విడుదల చేయబడినట్లు తెలుస్తున్నది. ప్రస్తుతం నల్గొండలో వెయ్యిమందికి పైబడిన కమ్యూనిస్టులు నిర్బంధంలో ఉన్నారు. వారిలో 50 మంది అగ్రనాయకులు.

## 40 మంది కమ్యూనిస్టులపై అభియోగాలు

హైదరాబాదు, ఏప్రిలు 27: నిర్బంధంలో ఉన్న కమ్యూనిస్టులను గురించి పోలీసులు తీవ్రంగా ఆచోకి తీస్తున్నారు. నలభైమంది కమ్యూనిస్టులపై అభియోగాలు తయారైనవి. వీరు స్పెషలు ట్రిబ్యూనలు వద్ద విచారణకు రానున్నారు.

## పట్టుపడని కమ్యూనిస్టు నాయకులు

హైదరాబాదు, ఏప్రిలు 27: బి. యెల్లమంద, కడెవెండిపరెడ్డి అనే ఇద్దరు కమ్యూనిస్టు నాయకులు ఇంతవరకు పట్టుపడలేదు. వారినిపట్టి ఇచ్చినవారికి హైదరాబాదు ప్రభుత్వం బహుమతిప్రకటించింది.

హైదరాబాద్, ఏప్రిల్ 27: రజాకార్ల హయాంలో బీదర్ జిల్లాలో ముస్లిం మతంలోకి మార్చబడిన దాదాపు వంద హిందూ కుటుంబాలు తిరిగి హిందూమతంలోకి మార్చబడినా యని దక్కన్ క్రానికల్ వ్రాసెంది.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, G. T. Madras